अशांति॰ स्त्री॰ శాంతి లేమి;
अशिक्षित॰ वि॰ చదువురానివాడు अनपढ़
अशिष्ट॰ वि॰ అసభ్యమైన; విధేయతలేని
अशिष्टता॰ स्त्री॰ అసభ్యత; మోటుతనము
अशुचि॰ वि॰ అపవిత్రము;
अशुद्ध॰ वि॰ శుద్ధముకానిది;
अशुद्धि॰ स्त्री॰ మురికి; తప్పు; పొరపాటు
अशुन, అశ్వినినక్షత్రము
अशुभ, वि॰ అమంగళము
अशेष॰ वि॰ అంతయు; అనంతము; అధికము
अशोक॰ वि॰ శోకములేని; पु॰ అశోక వృక్షము; అశోక చక్రవర్తి
अशोच॰ पु॰ చింతలేమి; శాంతి; వినయము
अशौच, पु॰ పురుడు; సూతకము; మైల; మురికి; అపవిత్రత
अश्क, पु॰ కన్నీరు आँसू
अश्म॰ पु॰ పర్వతము; రాయి; మేఘము; చకముకిరాయి; ఇనుము
अश्मर, वि॰ రాళ్ళతోకూడుకొనిన; రాతి సంబంధమైన [पथरी
अश्मरी॰ स्त्री॰ నీరుకట్టు రోగము;
अश्मर॰ पु॰ నీరుకట్టురోగము, अश्मरी
अश्रवण॰ वि॰ చెవులులేని; చెవిటి; पु॰ పాము; చెవుడు
अश्रांत॰ वि॰ ఎడతెగని; అలయని; क्रि॰ वि॰ ఎల్లప్పుడు; ఎడతెగకుండా
अश्राव॰ वि॰ విననిది; వినిపించనిది.
अश्राव्य॰ वि॰ వినదగనిది; पु॰ స్వగతము
अश्रि॰ } स्त्री॰ కత్తి పదును;
अश्री॰ } కత్తిఅంచు
अश्रु॰ पु॰ కన్నీరు आँसू
अश्रुत॰ वि॰ విననిది; వేదవిరుద్ధమైనది; చదువురానివాడు
अश्लिष्ट॰ वि॰ అసంబద్ధము; శ్లేష రహితము; మిశితముకానిది
अश्लील, वि॰ అసభ్యము; సిగ్గు చేటయినది; पु॰ పామరోక్తి; శబ్దదోషవిశేషము
अश्व॰ पु॰ గుఱ్ఱము; ఏడుసంఖ్య
अश्वतर॰ पु॰ కంచరగాడిద; खच्चर;
अश्वत्थ॰ पु॰ రావిచెట్టు; అశ్విని నక్షత్రము
अश्वत्थी स्त्री॰ చిన్న రావిచెట్టు
अष्ट॰ वि॰ ఎనిమిది आठ
अष्टक, पु॰ ఎనిమిది వస్తువులసమూహము; ఎనిమిది శ్లోకములస్తోత్రము; ఎనిమిది పద్యముల కావ్యము
अष्टछाप, पु॰ గోస్వామి విఠల్ దాస్ నిర్మయించిన ఎనిమిది మంది పుష్టిమార్గపు ఉత్తమ హిందీ కవులు [సూరదాస్, కుంభన్ దాస్, పరమానందదాస్, కృష్ణదాస్, ఛీత స్వామి, గోవింద స్వామి, చతుర్భుజ దాస్, నందదాస్]
अष्टपदी॰ स्त्री॰ ఎనిమిది చరణముల గేయము

अष्टम,
अष्टमक, } वि० ఎనిమిదవ; आठवाँ

अष्टांग, पु० సాష్టాంగనమస్కారమున కుపయోగించు ఎనిమిది అవయవములు; वि० ఎనిమిది అంగములులేక భాగములు గల

अष्टि, स्त्री० గింజ; విత్తు; 16 సంఖ్య; ఒక హిందీఛందము

असंख्य,
असंख्यक, } वि० లెక్కలేని; లెక్కించవీలులేని

असंख्यात, वि० లెక్కపెట్టనిది; లెక్కలేనన్ని

असंग, वि० ఏకాకియైన; సంసారబద్ధుడు కానివాడు; అడ్డులేనిది पु० భోగాసక్తిలేమి; ఒంటరికాడు; ఆత్మ

असंगत, वि० అనుచితము; కూడనిది; పొసగనిది

असंगति, स्त्री० కూడకలేమి; పొసగమి; అనౌచిత్యము

असंतुष्ट, वि० తృప్తిచెందనివాడు; కోపముగనున్నవాడు

असंतुष्टि, स्त्री०
असंतोष पु० } తృప్తిలేమి; కోపము

असंदिग्ध, वि० స్పష్టము;సందేహములేని

असंबंध, वि० సంబంధములేని; పొసగని; पु० సంబంధములేమి

असंबद्ध, वि० తలతోకలేని; పొసగని; సంబంధములేని

असंभव, वि० జరుగవట్టిది; కలుగనది

असंभार, वि० అపారము; విశాలము

असंभावना, स्त्री० అసంభవము; अनहोनापन

असंभावित, वि० సంభవించనిది; असंभव

असंभाव्य, वि० అసంభవమైనది; अनहोना,

असंयत, वि० నిర్బంధములేని; స్వాధీనములోలేని

असंयम, पु० ఇంద్రియ నిగ్రహములేమి

असंयमी, वि० ఇంద్రియ నిగ్రహములేనివాడు

असंहत, वि० వదులుగానున్న; చెల్లాచెదరుగానున్న

अस, वि० ఇట్లు; సమానమైన

असगुन, पु० అపశకునము

असत्, वि० చెడ్డది; శక్తిలేనిది; అస్తిత్వములేనిది; అసాధువు

असत्य, पु० అబద్ధము; మిథ్య

असन, पु० భోజనము; भोजन

असनाद, स्त्री० बहु బిరుదులు; ప్రమాణపత్రములు

असफल, वि० విఫలము; ఉత్తీర్ణుడుకాని

असफलता, स्त्री० వైఫల్యము

असबाब, पु० కారణములు; సామాను

असभ्य, वि० అనాగరికమైన; మర్యాదలేని

असमंजस, स्त्री० ఇబ్బంది; దిగులు; సంకోచము

असमग्र, वि० అసంపూర్ణమైన

असमत॰ पु॰ పాతివ్రత్యము; పవిత్రత
असमशर॰ पु॰ మన్మథుడు; कामदेव
असयाना, वि॰ అనాయకుడు; మూర్ఖుడు
असर॰ पु॰ ప్రభావము; ఒత్తిడి; గుణము
असरअंदाज, वि॰ ఒత్తిడి చేయువాడు; ప్రభావము కలుగజేయువాడు
असरार॰ पु॰ రహస్యము; बहु॰ శిరములు; क्रि॰ वि॰ నిరంతరము
असल, पु॰ మూలధనము; పునాది; ఇనుము; అస్త్రము; वि॰ శ్రేష్ఠము; యదార్థమైన; నిసలయిన
असलह॰ पु॰ ఈటె, శస్త్రము
असलहखाना, पु॰ శస్త్రాగారము
असलियत॰ स्त्री॰ వాస్తవము; అసలువిషయము; సారము
असली॰ वि॰ కల్తీ లేని; విజమైన; ప్రధానమైన; पु॰ తేనె; शहद
असलेत॰ / असलेऊ॰ } वि॰ సహింపగూడనిది; సహింపజాలనిది
असवार, पु॰ రౌతు; అశ్వదళ సైనికుడు; ఆరోహకుడు
असह॰ वि॰ సహింప శక్యముకానిది; ఓర్వలేనివాడు
असहन, वि॰ ఓర్వలేనివాడు; पु॰ శత్రువు; ఓర్వలేకపోవుట
असहनशील॰ वि॰ ఓర్వలేనివాడు, असहिष्णु
असहनीय, वि॰ సహింపజాలనిది; సహింపగూడనిది

असहयोग, पु॰ సహాయనిరాకరణము; Noncooperation
असहाब, पु॰ గొప్పవారు; साहब का बहु॰
असहाय॰ वि॰ తోడులేనివాడు; నిస్సహాయుడు
असहिष्णु, वि॰ ఓర్వలేనివాడు; असहनशील
असहिष्णुता॰ स्त्री॰ ఓర్వలేకపోవుట
असह्य, वि॰ సహింపగూడనిది; సహింపజాలనిది
असाँच, वि॰ అబద్ధము; ఝూఠ
असांप्रत, वि॰ అక్రమము; తగనిది; అయుక్తము
असांसद, वि॰ పార్లమెంటరీ పద్ధతికి వ్యతిరేకమైన; Un-Parliamentary
असा॰ पु॰ దండము; దుడ్డుకఱ్ఱ
असाई॰ पु॰ అజ్ఞాని; మూర్ఖుడు
असाढ़॰ पु॰ ఆషాఢమాసము
असाढ़ी, वि॰ ఆషాఢమాసపు; स्त्री॰ ఆషాఢపూర్ణిమ; ఆషాఢమాసము నుండి మార్గశిరమువరకు పండుపంట
असाध, वि॰ అసాధ్యము; అసాధువు
असाधु॰ वि॰ దుష్టమైన; తుచ్ఛమైన
असामयिक, वि॰ సమయముకానిది; बे-मौका
असामी, पु॰ పేరు; పేర్లపట్టిక; పదవి; అప్పుతీసుకొనువాడు; కౌలుదారుడు; ప్రతివాది; అసామి

असार, वि० నిస్సారము
असालत॰ स्त्री० నిజాయితీ; కులీనత
असालतन्, क्रि० वि० స్వయముగా; खुद 'वकालतन्' का उलटा
असावधान, वि० అజాగ్రత్తగల; నిర్లక్ష్యముగల
असावधानता॰ असावधानी, } स्त्री० అజాగ్రత్త; నిర్లక్ష్యము
असास॰ असासा॰ } पु० సామగ్రి; ఆస్తి
असि, स्त्री० ఖడ్గము; ఒకనది
असित॰ वि० నల్లనిది; దుష్టము; వంకరగల; पु० నలుపు; శని; నీలపురంగు; కృష్ణపక్షము
असितलोत्पल, पु० నీలకమలము
असिद्ध॰ वि० సరికానిది; ప్రామాణికముకానిది; పచ్చిది; అపూర్ణము; విఫలము; యోగసిద్ధిలభించని
असिद्धि, स्त्री० వైఫల్యము; పచ్చిదనము; అపూర్ణత్వము; ఋజువుకాకుండుట
असीम, वि० అపారము, అనంతము
असीमित, वि० అపరిమితము, अपरिमित
असीस॰ स्त्री० ఆశీర్వాదము, आशीर्वाद
असीसना॰ स० क्रि० ఆశీర్వదించుట
असु॰ पु० ప్రాణము; హృదయము; మనస్సు; పీడ; వేడిమి; శోకము; గుట్టము; యోచన; తలంపు; క్షణములో ఆరవభాగము
असुर, पु० రాక్షసుడు; భూమి; సూర్యుడు; ఏనుగు; రాహువు; మేఘము, దుష్టుడు; वि० జీవించియున్న; పృథివీసంబంధముకానిది
असुरा, स्त्री० రాత్రి; వేశ్య
असुराई, स्त्री० నీచత్వము; రాక్షసత్వము
असुरारि, पु० దేవత; విష్ణువు
असुविधा, स्त्री० అసౌకర్యము; ఇబ్బంది
असूझ, वि० అంధకారమయము; అపారము; కష్టమైనది; स्त्री० దూరదృష్టిలేమి
असूयक॰ वि० ఈర్ష్యగలవాడు; ईर्ष्यालु
असूया, स्त्री० ఓర్వలేనితనము; ईर्ष्या
असूर्यंपश्या॰ वि० स्त्री० ఎండకన్నెరుగనిది; स्त्री० ఘోషాస్త్రీ; పతివ్రత; పట్టపురాణి
असेग, वि० అసహ్యము, కఠినము
असेचन, असेचनक, असेचनीय, } वि० చూడముచ్చటగానున్నది; మిక్కిలి అందమైన
असौच, वि० అపవిత్రము; అశుద్ధము; నిశ్చింత
असोज, पु० ఆశ్వయుజమాసము
असौंध, स्त्री० దుర్గంధము, दुर्गंध
अस्कर॰ पु० సైన్యము, सेना
अस्करी, पु० సైనికుడు; सिपाही
अस्तंगत, वि० అస్తమించిన; క్షీణించిన
अस्त॰ पु० అదృశ్యము; అస్తమయము; పతనము; అంతము; वि०

విసరివేయబడిన; ముగిసిన; అస్తమించిన; గతించిన; దాగిన

अस्तबल, पुं० గుఱ్ఱపుశాల, घुड़साल

अस्तमन, पुं० సూర్యుడస్తమించుట

अस्तमित, वि० అస్తమించిన; నశించిన; లోపించిన

अस्तर, पुं० చందనతైలము; గుడ్డలోపల చేర్చి కుట్టబడిన మరియొకగుడ్డ

अस्तरकारी, स्त्री० సున్నముకొట్టుట; గచ్చుచేయుట

अस्तव्यस्त, वि० ఛిన్నాభిన్నము; చెల్లాచెదరుగానున్న

अस्ताचल, } पुं० సూర్యుడస్తమించు
अस्ताद्रि, } కొండ; పశ్చిమాద్రి

अस्ति, स्त्री० ఉనికి; శక్తి; భావము; क्रि० वि० వర్షా

अस्तित्व, पुं० ఉనికి; ఉండుట

अस्तु, अव्य० అగుగాక; మంచిది; ఏదయినప్పటికీ

अस्तेय, पुं० దొంగలింపమి

अस्त्र, पुं० బాణము; విల్లు; కత్తి

अस्त्रवेद, पुं० ధనుర్వేదము

अस्त्री, वि० అస్త్రధారి; విలుకాడు

अस्थाई, } वि० తాత్కాలికము;
अस्थायी, } శాశ్వతముకానిది

अस्थान, पुं० తప్పుచోటు; वि० మిక్కిలి లోతుగలది

अस्थि, स्त्री० ఎముక, हड्डी [कंकाल

अस्थिपंजर, पुं० ఎముకలగూడు;

अस्थिर, वि० చలించునది; స్థిరముకానిది

अस्थूल, वि० సూక్ష్మమైనది; బలవనిది; స్థూలము

अस्पताल, पुं० ఆసుపత్రి; दवाखाना

अस्पृश्य, वि० తాకగూడనిది; पुं० అంటరానివాడు

अस्पृश्यता, स्त्री० అంటరానితనము

अस्फुट, वि० రహస్యము; అస్పష్టమైన

अस्र, पुं० కన్నీరు; రక్తము; కాలము; మూల; యుగము; వెంట్రుక; వయస్సు

अस्रु, पुं० కన్నీరు; आँसू

अस्वस्थ, वि० జబ్బుగానున్న; बीमार

अस्वामिक, पुं० వారసులులేనిసొత్తు; वि० వారసుడులేని

अस्वीकार, पुं० స్వీకరించకపోవుట; అసమ్మతి

अस्वीकृत वि० అంగీకరింపబడని స్వీకరింపబడని

अस्वीकृति, स्त्री० అసమ్మతి, अस्वीकार

अस्सी, वि० ఎనుబది; पुं० 80 సంఖ్య

अहं, सर्व० నేను; पुं० అహంకారము

अहंकार, पुं० గర్వము, घमंड

अहंकारी, वि० గర్వముకలవాడు; घमंडी

अहंता, स्त्री० అహంభావము; घमंड

अह, पुं० దినము; పగలు; విష్ణువు; సూర్యుడు, अव्य० అహా! ఔరా! అహహా!

अहक, स्त्री० కోరిక, इच्छा

अहकना, स० क्रि० కోరుట
अहकाम, पु० ఆజ్ఞలు; ఆదేశములు, हुकुम का बहु०
अहतमाल, पु० అపాయము, ख़तरा
अहतिमाम, पु० ఏర్పాటు, प्रबन्ध
अहतियात. स्त्री० జాగ్రత్త
अहद, पु० సమయము; అంగీకారము; ఒడంబడిక
अहदनामा, पु० అంగీకార పత్రము; Agreement; ఒడంబడిక పత్రము
अहदशिकनी, स्त्री० వాగ్దాన భంగము
अहदी, वि० సోమరి; पु० అత్యవసర పరిస్థితిలో పనికుపయోగింపబడు సైనికుడు
अहदेहुकूमत, पु० పరిపాలనాకాలము; राज्य-काल
अहना, अ० क्रि० అగుట; జరుగుట; होना
अहन्, पु० పగలు; రోజు
अहनिसि, क्रि० वि० రేయింబవళ్లు
अहबाब, पु० ప్రియులు; స్నేహితులు; हबीब का बहु०
हमक, पु० మూర్ఖుడు, मूर्ख
हमद, पु० మిక్కిలిపూజ్యుడు
हमेव, पु० గర్వము, घमंड
अहरन, पु० కమ్మరివాని దాగలి, निहाई
अहरह, क्रि० वि० నిరంతరము; ప్రతిదినము
अहरा, पु० పిడకలరాశి
अहराम, पु० ఈజిప్టులోని పిరమిడ్లు; పురాతనభవనములు
अहरार, पु० ఉదారహృదయుడు; దాత
अहर्निश, क्रि० वि० రేయింబవళ్ళు; ఎల్లప్పుడు
अहलकार, पु० కార్యకర్త; గుమస్తా; నౌకరు, ఆఫీసరు
अहलना, अ० क्रि० చలించుట; కదలుట; వణకుట
अहलमद, पु० కోర్టుఉత్తరువుల జారీ చేయువాడు; కోర్టురికార్డుల రక్షణోద్యోగి
अहलेइल्म, पु० విద్వాంసులు; పండితులు
अहलेकलाम, पु० విద్వాంసుడు
अहले-वतन पु० స్వదేశీయులు; देशवासी
अहवाल, पु० बहु० వృత్తాంతములు; हाल का बहु०
अहसान, पु० కృతజ్ఞత; ఉపకారము; దయ
अहह, अव्य० అహాహా! ఔరా! అహా!
अहाता, ఆవరణము; ప్రాకారము
अहारना, स० क्रि० తినుట; అంటించుట; గుడ్డకు గంజి పెట్టుట
अहि, पु० పాము; వృత్రాసురుడు; భూమి; సూర్యుడు
अहित, पु० శత్రువు; కీడు; వైరము; वि० కీడుచేయునట్టి
अहिनाथ, पु० ఆదిశేషువు; शेषनाग

अहिरिन: स्त्री० గొల్లపడుచు; పాల మ్మెదిస్త్రీ
अहिवात॰ पु० ముత్తైయిదువతనము, सोहाग
अहिवातिन॰ अहिवाती॰ } स्त्री० ముత్తైయిదువ; सौभाग्यवती
अहीर॰ पु० గొల్లవాడు; పాలమ్మెడివాడు
अहीरिन, स्त्री० పాలమ్మెడిస్త్రీ; గొల్లస్త్రీ
अहुटना॰ अ० क्रि० తొలగుట; వేరగుట; దూరమగుట
अहुठ, वि० మూడున్నర; साढे तीन
अहेतुक, वि० నిష్కారణము; क्रि० वि० వ్యర్థముగా
अहेर, पु० వేట; వేటాడబడుమృగము; ఆట
अहेरिया॰ वि० వేటాడునట్టి
अहेरी॰ पु० వేటగాడు; ఆటగాడు
अहो॰ अव्य० అహో! (విస్మయార్థకము)
अहोरात्र, पु० రేపగలు; क्रि० वि० ఎప్పుడును
अहोरा, बहोरा॰ पु० పెండ్లికూతురు అత్తవారింటికివెళ్ళి పుట్టింటికి అదేరోజు తిరిగివచ్చుయొక వివాహపద్ధతి क्रि० वि० మాటిమాటికి

## आ

आँक, पु० చిహ్నము; అక్షరము; గీత; సంఖ్య; లెక్క; ఒడి; అంశము; నిర్ణయము
आँकड़ा॰ पु० కొంకె; ఒడి; మరమేకు
आँकड़े, पु० జవాబులెక్క, వృత్తులు మొ॥ వానికి సంబంధించిన వివరములు దెలుపు సంఖ్యాపట్టికలు, Statistics
आँकन, पु० ధాన్యపు లేక మొక్కజొన్న గింజ
आँकना, स० क्रि० అంచనావేయుట మదింపువేయుట; గుర్తుపెట్టుట; ముద్రవేయుట
आँकर, वि० లోతైన; అత్యధికము; ఎక్కువవెలగల
आँकरी, स्त्री० అంకుశము; బాణపుమొన
आँकुश, पु० అంకుశము; अंकुश
आंकुशिक॰ पु० మావటీడు; महावत
आँकुस, पु० అంకుశము; आंकुश
आँकू॰ पु० అంచనావేయువాడు
आँख, स्त्री० కన్ను; దృష్టి; వివేకము; సంతానము; సూదిబెజ్జము; కృపాదృష్టి; నెమలిపురికన్ను
आँखड़ी, स्त्री० కన్ను; చూపు; చూచురీతి
आँखफोड़ना, पु० మిడుత; గొల్లభామ; A grass hopper
आँख मिचौनी॰ आँख मिचौली, आँख मीचली॰ आँख मुँदाई आँख मुचाई } स्त्री० దాగుడుమూతలాట Hide-and-Seek
आँखा, स्त्री० ఎద్దుపైవేయుగంత
आंग॰ पु० కోమలశరీరము; वि० శారీరికము; అంగధారి

आँग, पुं० శరీరము; అంగము; చన్ను
आँगन, पुं० ముంగిలి; చౌక; తలవాకిలి;
आंगिक वि० శరీరసంబంధమైన; पुं० మృదంగము వాయించువాడు; నాటకాభినయ విశేషము; కనుబొమల నెగురవేయుట
आँगी, स्त्री० రవికె; జల్లెడ
आँगुर, पुं०, आँगुरिया, स्त्री० } ౹వేలు; అంగుళము
आँगुरी, स्त्री० ౹వేలు, तंगली
आँगुल, पुं० అంగుళము; ౹వేలు
आँघी, स्त्री० పిండిజల్లెడ
आँच, स्त्री० వేడిమి; నిప్పు; అగ్ని జ్వాల; విరహాగ్ని; దెబ్బ; కీడు
आँचना, स० क्रि० కాల్చుట; వేడిచేయుట
आँचर, आँचल, } అంచు; కొంగు; చన్ను
आँजन, पुं० కాటుక, अंजन
आँजना, स० क्रि० కాటుకపెట్టుట
आँट, स्त्री० స్పర్ధ; విరోధము; ముడి; చూపుడు౹వేలుకు బొటన౹వేలుకు మధ్యనుండు స్థలము; పందెము; అవకాశము
आँटना, अ० क्रि० ఇముడుట; నిండుట; చేరుట; దొరుకుట; स० क्रि० నింపుట
आँटसाँट, स्त्री० కలయిక; కుట్ర; అడ్డంకి
आँटी, स्त्री० బిల్లంగోడు; నూలుకండె; చిన్నగడ్డిమోపు; చిన్నపుల్లలకట్ట
आँठी, स्त्री० పెరుగు, టెంకె; ముడి, బాలికస్తనము
आँड़, पुं० అండకోశము; అండాకృతి
आँड़ी, स्त्री० ముడి; గనుపు; కొన; అండకోశము
आँत, स्त्री० పురీషనాళము; ౹పేగు
आंतर, वि० లోపలి; గుప్తమైన; पुं० ఆప్తమిత్రుడు; హృదయము; అభి౹ప్రాయము;
आँतर, पुं० దూరము; భేదము; వ్యవధి; చాటు; చెట్లపొదులమధ్యనున్న కాలిబాట
आँतरिक, वि० ఆంతరంగికము; లోపలి
आंतिककर, पुं० యాత్రాసుంకము
आंत्रिक, वि० ౹పేగులకు సంబంధించిన
आँदू, पुं० సంకెల; ఏనుగుకాలిగొలుసు
आँदोल, पुं० ఉయ్యాల; ఊగుట
आंदोलन, पुं० గంద్రగోళము; ఊగుట; ఆందోళన
आँदोलित, वि० గంద్రగోళముగానున్న; కంపించెడు; ఊపబడిన
आंध, स्त्री० చీకటి; ఆపద
आँधना, अ० क्रि० విరుచుకుపడుట; తటాలున ఎదుర్కొనుట
आँधर, आँधरा } वि० ౹గుడ్డియైన, अंधा
आँधी, स्त्री० గాలివాన; తుఫాను; वि० మిక్కిలి వేగముగల
आँय-बाँय, स्त्री० వ్యర్థ౹ప్రలాపము; वि० అసంబద్ధమైన

आँवठ, पुं० అంచు, किनारा
आँवड़ना, अ० क्रि० పొర్లుట; పొంగుట
आँवड़ा, वि० లోతైన; गहरा
आँवरा
आँवला } पुं० ఉసిరికాయ లేక చెట్టు
आँवाँ, पुं० ఆవము; आवाँ
आंशिक, वि० కొంచెము; అంశమునకు సంబంధించిన
आँस, पुं० కన్నీరు; వేదన; स्त्री० దారము; త్రాడు
आँसला, वि० కన్నీటితోనిండిన; వేదనా భరితమైన
आँसी, स्त्री० వాయనము; సూడిద; మిత్రులకు పంపుమిఠాయి
आँसू, पुं० కన్నీరు; अश्रु
आइंदा, क्रि० वि० భవిష్యత్తులో; ఇక ముందు; वि० రానున్న; జరుగబోవు
आइ, स्त्री० జీవితకాలము; आयु
आइना, पुं० అద్దము; आईना
आई स्त्री० ఆయువు; మృత్యువు
आईन, पुं० నియమము; చట్టము; విధానము
आईनयाँ, पुं० న్యాయశాస్త్రవేత్త; వకీలు
आईना, पुं० అద్దము; दर्पण
आईनासाज़, पुं० అద్దములు లేక గాజు సామానులు చేయువాడు
आईनी, वि० చట్టబద్ధమైన
आउ, स्त्री० వయస్సు; ఆయువు
आउ-बाउ, पुं० వ్యర్థప్రలాపము; प्रलाप
आऊ, स्त्री० ఆయువు:వయస్సు
आक, पुं० జిల్లేడు; मदार
आकंठ, क्रि० वि० నడుమువరకు వచ్చేడు;
क्रि० वि० నడుమువరకు [अ०-बक
आक-बाक, स्त्री० వ్యర్థప్రలాపము,
आकर, पुं० గని; సమూహము; సింహ పుగుహ; జన్మస్థానము; భజానా; రకము; वि० శ్రేష్ఠము; నేర్పుగల; (కొన్ని) రేట్లు [करा
आक़रक़रहा, पुं० అక్కలకర్ర; अकर-
आकर्णित वि० వినినది; सुनाहुआ
आकर्ष, पुं० ఆకర్షించుట; జూదము; పాచిక; సూదంటురాయి; గీటురాయి
आकर्षना, स० क्रि० ఆకర్షించుట; లాగుట
आकलन, पुं० అవగాహనము; కోరిక; లెక్కించుట; జమకట్టుట; కూడ బెట్టుట;అన్వేషణ
आकलित, वि० పరిగణింపబడిన; సంగ్రహింపబడిన; అవగాహనచేస కొనబడిన
आकली, स्त्री० వ్యాకులత; बेचैनी
आकल्प, पुं० వస్త్రాద్యలంకరణము; क्रि० वि० కల్పపర్యంతము
आकस्मिक, वि० అకస్మాత్తుగకలిగెడు కారణములేని
आकांक्षा, स्त्री० కోరిక; అన్వయమ కొరకు ఒకపదము మరియొకపద ముసు కోరుట

आकांक्षित, वि० కోరబడిన; अपेक्षित

आकांक्षी॰ वि० కోరికకలవాడు

आक़ा, पु० భగవంతుడు; యజమాని; నాయకుడు; అధ్యక్షుడు

आका, पु० అన్న; बड़ाभाई

आकार, पु० నిర్మాణము; రూపము; సైగ

आकाश, पु० ఆకాశము; శూన్యము; రంధ్రము; బ్రహ్మము; ఈశ్వరుడు

आकाशकुसुम, पु० మిక్కిలి అసంభవమైన విషయము

आकाशजल, पु० మంచు, వర్షపునీరు

आकाशतार, पु० రేడియోసంజ్ఞలను గ్రహించుటకై గాలిలోనుంచెడి తీగె

आकाशयान॰ पु० విమానము; हवाई-जहाज

आकाशवाणी॰ स्त्री० అశరీరవాణి; దైవవాక్కు; రేడియో

आकाशवृत्ति, स्त्री० నికరములేనిరాబడి; అనిశ్చితమైన బ్రతుకుతెరువు

आकाशी, स्त्री० వితానము; ఏరియల్

आकाशीय, वि० ఆకాశసంబంధమైన; ఆకాశములోనున్న లేక పుట్టిన

आकिंचन } आकिंचन्य } पु० దారిద్ర్యము; निर्धनता

आक़िब, वि० సహాయకుడు; వెనుక వచ్చువాడు

आक़िबत॰ वि० పరలోకము

आक़िल॰ वि० బుద్ధిమంతుడు; జ్ఞాని; మేధావి

आकीर्ण॰ वि० నిండియున్న; వ్యాప్తమైన

आकुंचन॰ पु० ముడుచుకొనుట; వంకరగా నుండుట

आकुंचित, वि० ముడుచుకొనిన; వక్రముగానున్న

आकुल॰ वि० కలతజెందిన; సందిగ్ధము; భయపడిన

आकुलता, स्त्री० వ్యాకులత; భయము

आकुलित, वि० (చూ)॰ आकुल

आकूत॰ पु० అభిప్రాయము; ఆశ్చర్యము; కోరిక; ప్రేరణ; అనుభూతి

आकृत॰ वि० రూపొందిన

आकृति, स्त्री० రూపము; ఆకారము

आकृष्ट॰ वि० ఆకర్షింపబడిన; లాగబడిన

आकृष्टि॰ स्त्री० గురుత్వాకర్షణ; ఆకర్షణ; ఈడుపు

आक्रंद } आक्रंदन } पु० ఏడ్పు; అరుపు

आक्रंदित॰ वि० బిగ్గరగా ఏడ్చెడు; పిలువబడిన

आक्रंदी॰ पु० బిగ్గరగాఏడ్చు లేక పిలుచు లేక అరచువాడు

आक्रम॰ पु० పరాక్రమము; ఓడించుట; దండయాత్ర

आक्रमण॰ पु० దాడి; బలాత్కారము

आक्रमित॰ वि० ఆక్రమింపబడిన

आक्रांत॰ वि० ఆక్రమింపబడిన; ముట్టడింపబడిన

आक्रामक॰ वि॰ ఆక్రమించెడు; पु॰ దురాక్రమణదారుడు

आक्रोश॰ पु॰ శాపము; తిట్టు, నింద

आक्रोशक॰ पु॰ శపించువాడు; తిట్టువాడు;

आक्रोशन॰ पु॰ తిట్టుట; శపించుట; నిందించుట

आक्लांत वि॰ దుఃఖమునొందిన; అలసిన

आक्षेप॰ पु॰ అడ్డంకి; వ్యంగ్యము; నిందారోపణ; తిరస్కారము; ఆక్షేపణము; పడత్రోయుట

आक्षेपक॰ वि॰ ఆక్షేపించునట్టి पु॰ ఆక్షేపించువాడు

आक्षेपी॰ पु॰ ఆక్షేపించువాడు

आख॰ पु॰ గుద్దలి; పార

आखत॰ पु॰ అక్షతలు; अक्षत

आख़ता॰ वि॰ విత్తుకొట్టిన పశువు; बधिया

आखन॰ क्रि॰ वि॰ ప్రతిక్షణము; पु॰ పార; గుద్దలి

आखना॰ स॰ क्रि॰ చెప్పుట; చూచుట; కోరుట; జల్లించుట; ఉల్లంఘించుట

आखनिक॰ पु॰ గనిత్రవ్వువాడు; ఎలుక; దొంగ; గుద్దలి; పంది

आखर, पु॰ వర్ణము; అక్షరము; గొడ్డలి; గుద్దలి

आखा॰ पु॰ పిండిజల్లెడ; वि॰ పూర్తిగ

आखात॰ पु॰ జలాశయము; విశాలమగు సముద్రశాఖ

आख़िर, क्रि॰ वि॰ చివరకు

आख़िरी॰ वि॰ కట్టకడపటి

आखीर॰ वि॰ आख़िर

आखेट॰ पु॰ వేట; शिकार

आखेटक॰ पु॰ వేటకుక్క; వేటకాడు; वि॰ భయంకరము; నేర్పుగా వేటాడగల

आखोट॰ पु॰ అక్రోటుపండు; अखरोट

आखोर, पु॰ చెత్త చెదారము; పచ్చికబీడు; నీరుత్రాగెడిచోటు; वि॰ నీచము; కుళ్ళిన; దుర్వాసనగల

आख्ता॰ वि॰ బీజములుతీసిన (పశువు)

आख्या, स्त्री॰ వాఖ్య; వివరణ; కీర్తి; పేరు

आख्यात, वि॰ ప్రసిద్ధిజెందిన; వివరింపబడిన

आख्याति, स्त्री॰ ఖ్యాతి; చెప్పుట; పేరు

आख्यान, पु॰ వర్ణన; వృత్తాంతము; కథ; చెప్పుట

आख्यायक, वि॰ पु॰ వివరించువాడు; సందేశవాహకుడు

आख्यायिका॰ स्त्री॰ నవల; కథ

आगंतु. वि॰ అకస్మాత్తుగావచ్చెడు; దారితప్పిన; ఆకస్మికము; पु॰ అతిథి

आगंतुक॰ पु॰ అతిథి; वि॰ ఆకస్మికముగా వచ్చెడు లేక జరిగెడు

आग, स्त्री॰ అగ్ని; ఈర్ష్య; తపన; పాపము; वि॰ వేడిగానున్న ఆకస్మికము; क्रि॰ वि॰ ముందు

आगत, वि० వచ్చిన; జరిగిన; పొంద బడిన, पुं० అతిథి: సంఘటన ఆగమనము

आगत-स्वागत पुं० స్వాగతము; సత్కారము

आगम, पुं० జన్మ;రాక; ప్రాప్తి; వృద్ధి; రాబడి; శాస్త్రములు; నీతిశాస్త్రము; భవిష్యత్తు; వ్యాకరణమునందు అధికముగా వచ్చెడు వర్ణము, वि० ఇకముందు జరుగబోవునది

आगमजानी, } वि० భవిష్యత్తు
आगमज्ञानी, } తెలిసినవాడు

आगमन, पुं० రాక; ప్రాప్తి

आगमवाणी, स्त्री० భవిష్యద్వాణి

आगमसोची, वि० దూరాలోచనగల; భవిష్యత్తునెరిగిన [రానున్నది

आगमी, पुं० జ్యోతిష్కుడు; वि०

आगर, पुं० గని; రాశి; ఇల్లు; ఇంటిపైకప్పు; అమావాస్య; ఉప్పు గుంట; वि० అధికము; శ్రేష్ఠము; నేర్పుగల; क्रि० वि० మిక్కిలి ఎక్కువగా

आगरी, पुं० ఉప్పు తయారుచేయువాడు

आगल, पुं० గడియ; वि० రానున్నది; తరువాతది; क्रि० वि० ఎదుట; ముందు

आगवन, पुं० ఆగమనము; आगमन

आगा, पुं० ముఖము; ముందుభాగము; భవిష్యత్తు; రొమ్ము; పరిణామము

आग़ा, पुं० యజమాని; అన్న; కాబుల్‌నివాసి; పఠాణ

आग़ाज़, पुं० ప్రారంభము; आरंभ

आगापीछा, पुं० వెనుకముందాడుట; సంకోచము; పరిణామము

आगामिक, वि० రానున్న

आगामी, वि० జరుగబోవు; రానున్న

आगार पुं० ఇల్లు; కోశాగారము; స్థానము

आगाह, वि० తెలిసిన; పరిచితమైన; पुं० భవితవ్యము

आगाही, स्त्री० సూచన; పరిచయము; జ్ఞానము

आगि, स्त्री० అగ్ని; आग

आगिल, } वि० మరియొక; తరు
आगिला, } వాతది; రానున్నది

आगी, स्त्री० అగ్ని; आगि

आगू, स्त्री० ప్రతిజ్ఞ; వాగ్దానము; क्रि० वि० ముందు; पुं० పరిణామము

आगृहीत, वि० తీసికొనబడిన

आगृहीती, पुं० తీసికొనువాడు

आगे, क्रि० वि० ముందు; పిమ్మట; ఎదుట; భవిష్యత్తులో

आगोश स्त्री० ఆలింగనము; రొమ్ము

आगोन, पुं० ఆగమనము; आगवन

आग्नेय, वि० అగ్నిసంబంధమైన; पुं० అగ్నిపర్వతము; తుపాకిమందు; ఆగ్నేయమూల

आग्नेयी, स्त्री० కృత్తికానక్షత్రము; ఆగ్నేయమూల

आग्रह, पुं० పట్టుదల; నైతికబలము; ఆసక్తి

आग्रही, वि० పట్టుదలగల; हठी

आघ, पुं० మూల్యము; ధర

आघर्ष, आघर्षण } पुं० రాపిడి; रगड़

आघात, पुं० దెబ్బ; ఆపద; వధ్యస్థానము

आचमन, पुं० ఉపస్పర్శము; వార్పు; ఆచమనమున త్రాగునీరు

आचमनक, पुं० ఉమ్మిపాత్ర; ఆచమనమున త్రాగునీరు

आचमनी, स्त्री० చిన్నచెంచాలేక గరిట

आचमनीय, वि० ఆచమనము చేయదగిన, पुं० ఆచమనమున త్రాగునీరు; ఉమ్మిపాత్ర

आचमित, वि० ఆచమనము చేయబడిన; త్రాగబడిన

आचरज, पुं० ఆశ్చర్యము; अचरज

आचरण, पुं० నడత; ఆచారము; శుద్ధి

आचरणीय, वि० ఆచరింపదగిన; చేయదగిన

आचरन, पुं० दे० आचरण

आचरना, अ० क्रि० ఆచరించుట

आचरित, वि० ఆచరింపబడిన; నడపబడిన; చేయబడిన

आचाम, पुं० గంజి; ఆచమనము

आचामम, पुं० ఆచమనముచేయువాడు

आचार, पुं० సత్ప్రవర్తన; పద్ధతి; వాడుక; సంప్రదాయము

आचारवान, वि० సదాచారసంపన్నుడు

आचार-विचार, पुं० జీవనపద్ధతి; రీతి; రివాజు; మంచిచెడత

आचारशास्त्र, पुं० నీతిశాస్త్రము; Ethics

आचार्याणी, आचार्यानी, } स्त्री० ఆచార్యునిభార్య

आचित्य, वि० ఆలోచనకు అందని; पुं० ఈశ్వరుడు

आच्छन्न, वि० కప్పబడిన; రహస్యమైన; మూయబడిన

आच्छाद, पुं० వస్త్రము; కప్పుట

आच्छादक, पुं० కప్పునది; మూయునది; దాచునది

आच्छादन, पुं० మూత; కప్పుట; దాచుట; వస్త్రము; మూయుట

आच्छादित, वि० కప్పబడిన; మూయబడిన

आज, क्रि० वि० ఈనాడు; ఈకాలమున; ఈసమయమున; पुं० నేడు; నెయ్యి; वि० మేకసంబంధమైన [ప్రస్తుతము

आजकल, क्रि० वि० ఈరోజులలో;

आजन्म, क्रि० वि० పుట్టినప్పటినుండియు; జీవితమంతయు

आज़मंद, वि० పేరాశగలవాడు; लालची

आज़म, वि० గొప్ప; महान

आजमा, वि० పరీక్షించెడు; అజమాయిషీచేసెడు

आजमाइश, स्त्री० పరిశీలన; పరీక్షించుటకై చేయుప్రయోగము;

आज़माना॰ स॰ क्रि॰ పరీక్షించుట; ప్రయోగించి పరీక్షించుట

आज़मूदा॰ वि॰ పరీక్షింపబడిన; ప్రయోగింపబడిన

आजा॰ पु॰ పితామహుడు; తాత; दादा

आज़ाद॰ वि॰ స్వతంత్రమైన; నిర్భయుడు; నిరంకుశుడు

आज़ाद-मिज़ाज॰ वि॰ స్వేచ్ఛగా వ్యవహరించెడు; मनमौजी

आज़ादाना॰ क्रि॰ वि॰ స్వతంత్రముగా

आज़ादी॰ स्त्री॰ స్వాతంత్ర్యము; విడుదల

आज़ादी-पसंद॰ वि॰ స్వాతంత్ర్యప్రియుడు

आजान, पु॰ జన్మభూమి; పుట్టుక; क्रि॰ वि॰ పుట్టినప్పటినుండియు

अजानु॰ वि॰ మోకాలువరకునున్న

आजानु-बाहु॰ वि॰ మోకాలివరకు పొడవుగల చేతులుగలవాడు

आजानेय॰ पु॰ మేలుజాతి గుఱ్ఱము; वि॰ మేలుజాతికి చెందిన; కులీనుడు

आज़ार॰ पु॰ రోగము; కష్టము; నొప్పి

आज़ारी॰ पु॰ రోగి; रोगी

आजि॰ पु॰ రణరంగము; యుద్ధము; క్షణకాలము

आजिज़॰ वि॰ విసిగిన; కలతచెందిన; వినయముగల; దీనుడు; అశక్తుడు

आजिज़ी॰ स्त्री॰ అశక్తత; దైన్యము గత్యంతరములేమి; వినయము

आज़िम॰ वि॰ కోరికగల, కోరెడు

आजी॰ स्त्री॰ అవ్వ; నాయనమ్మ; दादी

आजीव॰ पु॰ బ్రతుకు తెరువు; జీవనోపాయము

आजीवन, पु॰ బ్రతుకుతెరువు; జీవనోపాయము; क्रि॰ वि॰ బ్రతికినంతకాలము

आजीविका॰ स्त्री॰ బ్రతుకుతెరువు; వృత్తి

आजु॰ क्रि॰ वि॰ ఈ సమయమున; ఈ రోజున; पु॰ నేడు

आज्ञप्ति॰ स्त्री॰ కోర్టు డిక్రీ; ఆజ్ఞ

आज्ञा॰ स्त्री॰ అనుమతి; ఆదేశము; ఉత్తరువు

आज्ञाकारी॰ वि॰ విధేయుడు; సేవకుడు

आज्ञापक॰ पु॰ నిర్దేశకుడు; ఆజ్ఞాపించువాడు; యజమాని (చుట

आज्ञापालन॰ पु॰ తలవొగ్గుట; పాటించుట

आज्ञापिका, स्त्री॰ ఆజ్ఞాపించుస్త్రీ

आज्ञापित॰ वि॰ ఆజ్ఞాపింపబడిన

आज्य, पु॰ నేయి, घी

आटा॰ पु॰ పిండి; पिसान

आटीकर, पु॰ ఎంబోతు; साँड़

आठ, वि॰ ఎనిమిది; पु॰ 8 సంఖ్య

आठवारा॰ पु॰ ఎనిమిదిరోజుల కాలము

आडंबर॰ पु॰ దంబము; డేరా; యుద్ధ నగారా; ఏనుగుఘీంకారము; ఆచ్ఛాదనము; గర్వము; ఆనందము; మేఘ గర్జన; యుద్ధాదిసన్నాహము

आड़॰ स्त्री॰ చాటు; అడ్డు; ఆధారము; ఆశ్రయము

आड़ा, वि० అడ్డముగా నున్న; వంకరగా నున్న, पु० ఓడయొక్క దూలము; బట్టనేతయందలి అడ్డనూలు; పేక

आड़ि॰ स्त्री० మొండిపట్టుదల, हठ

आडू॰ पु० తెప్ప; నావ; ड्डप

आडू॰ पु० దొండపండువంటి ఒక ఎఱ్ఱని పండు; A Peach

आढ़त॰ स्त्री० కమీషన్ వ్యాపారము; ఏజన్సీ

आढ़तदार, } पु० కమీషన్ ఏజంటు;
आढ़तिया, } దలారి.

आढ्य॰ वि० సంపన్నుడు; అధికము; మిక్కుటము.

आणव॰ वि० అతిసూక్ష్మమైన; అణురూపమైన, पु० అణుత్వము

आणविक॰ वि० పరమాణుసంబంధమైన

आणि॰ स्त्री० మర్మస్థానము; అంచు; పొలిమేర; చీల; ఇరుసు తుదిచీల;

आतंक॰ पु० రోగము; ప్రతాపము; పలుకుబడి; బాధ; భయము

आतंकवादी॰ वि० భయపెట్టువాడు; బెదరించువాడు

आतंचन॰ पु० తోడు మజ్జిగ; जामन

आतताई } वि० దుర్మార్గుడు; హంతకుడు; पु० ప్రజాపీడకుడు;
आततायी } నిప్పుపెట్టు వాడు; విషము పెట్టువాడు; శస్త్రధారి; స్త్రీధనాదుల అపహరించువాడు; అన్నిటికి తెగించియున్న దుర్మార్గుడు; దోపుడుదొంగ

आतप पु० ఎండ; ప్రకాశము; వేడిమి.

आतप स्नान॰ पु० సూర్యరశ్మిసోకుటకై ఎండలో నుండుట; Sunbath

आतपी॰ पु० సూర్యుడు; वि० ఎండకు సంబంధించిన

आतर॰ पु० రేవుకూలి; పడవకూలి; రేవు

आतश॰ पु० అగ్ని; आग

आतशक॰ स्त्री० కొరుకు రోగమనెడి సుఖరోగము; Syphilis

आतशबाज़॰ पु० బాణ సంచా తయారు చేయులేక అమ్ము లేక కాల్చువాడు

आतशबाजी॰ स्त्री० బాణసంచా; బాణ సంచా తయారుచేయుపని.

आतश मिजाज॰ वि० మిక్కిలి కోపిష్ఠి

आतशी, वि० అగ్నిసంబంధమైన

आतशी आईना॰ } पु० సూర్యకాంతపు
आतशी शीशा॰ } రాయి, సూర్యునివైపు చూపగనే నిప్పును పుట్టించు అద్దము; భూత అద్దము.

आतिथेय, वि० అతిథికి తగిన; पु० అతిథి సత్కారము; అతిథిని సత్కరించువాడు

आतिथेयी, स्त्री० అతిథిసత్కారము.

आतिथ्य॰ पु० అతిథి సత్కారము; విందు; అతిథి

आतिफ़॰ वि० దయగల; मेहरबान

आतिफ़त॰ स्त्री० దయ; मेहरबानी

आतिश, पु० అగ్ని; आग

आतिश मिज़ाज॰ वि० మిక్కిలికోపిష్ఠి

आतिशयिक॰ वि० మిక్కిలి ఎక్కువ.
अतिशय्य, पु० ఆధిక్యము; बहुतायत
आतिशी शीशा॰ पु० दे० आतशी शीशा
आती-पाती॰ स्त्री० ఒకరకమైన పిల్లల దాగుడుమూతలాట
आतुर॰ वि० తొందరపడెడు; వ్యాకుల పడెడు; ఆతురుడైన; అధైర్యపడిన.
आतुरता॰, आतुरताई॰, आतुरी॰ स्त्री० వ్యాకులత; అధైర్యము; తొందరపాటు
आत्म, वि० తనయొక్క; अपना
आत्मघात॰ पु० ఆత్మహత్య; आत्महत्या
आत्मचरित॰, आत्मचरित्र. पु० ఆత్మకథ
आत्मज॰ पु० కుమారుడు; మన్మథుడు
आत्मजा. स्त्री० కుమార్తె; बेटी
आत्मज्ञ॰ पु० ఆత్మజ్ఞానముకలవాడు
आत्मज्ञान॰ पु० మోక్షవిషయమైన బుద్ధి; తన్నుతాను తెలిసికొనుట
आत्मतुष्टि॰ स्त्री० ఆత్మానందము; ఆత్మతృప్తి
आत्मत्याग॰ पु० స్వార్థత్యాగము; ఆత్మహత్య
आत्मनिवेदन. पु० ఆత్మసమర్పణ
आत्मबोध, पु० ఆత్మజ్ఞానము; आत्मज्ञान
आत्मभ॰ वि० తనకుతానై జన్మించిన; पु० బ్రహ్మ; విష్ణువు; ఈశ్వరుడు; మన్మథుడు
आत्ममानी॰ पु० గర్విష్ఠి; घमंडी

आत्मरत॰ वि० బ్రహ్మజ్ఞాని
आत्मरति॰ स्त्री० ఆత్మానందము
आत्मवंचक, वि० తన్నుదాను మోసగించుకొనువాడు
आत्मवंचना॰ स्त्री० తన్నుదాను మోసగించుకొనుట
आत्मवध॰ पु० ఆత్మహత్య
आत्मवाद, पु० ఆధ్యాత్మికవాదము
आत्मविद्या॰ स्त्री० ఆధ్యాత్మికవిద్య
आत्मविस्मृति॰ स्त्री० చైతన్యములేనిస్థితి; మైమరచుట
आत्मसयम, पु० మనోనిగ్రహము
आत्मसात्॰ पु० కాజేయుట; वि० తనలో చేర్చుకొనిన; తనదిగా చేసికొనుట; क्रि० वि० తన వశమునందు
आत्मसिद्धि॰ स्त्री० మోక్షము; అప్రయత్నముగా సిద్ధించునది
आत्मा, स्त्री० జీవాత్మ; బుద్ధి; మనస్సు; పరమాత్మ; దేహము; హృదయము; చైతన్యము; స్వభావము; ధైర్యము
आत्मानुभव, पु० స్వానుభవము
आत्मानुभूति॰स्त्री० ఆత్మసాక్షాత్కారము
आत्माभिमान॰ पु० స్వాభిమానము; ఆత్మగౌరవము; పొగరు; అహంకారము
आत्माराम॰ पु० జీవాత్మ; బ్రహ్మ; ఆత్మజ్ఞానముకలవాడు; రామచిలుక
आत्मावलंबी॰ पु० స్వశక్తిపైఆధారపడినవాడు.

आत्मिक, वि० ఆత్మ సంబంధమైన; మానసికమైన; తనయొక్క
आत्मीय, वि० తనయొక్క; पु० బంధువు
आत्मीयता, स्त्री० మైత్రి; తన దనుభావము
आत्मोत्कर्ष, पु० ఆత్మప్రశంస.
आत्मोत्सर्ग, पु० పరోపకారార్థమైస్వార్థత్యాగము చేయుట.
आथ, पु० అర్థము; अर्थ [స్వభావము
आदत, स्त्री० అలవాటు; వ్యసనము;
आदतन, क्रि० वि० అలవాటుగా
आदम, पु० ఆదిమానవుడు; మానవుడు
आदमक़द, वि० మనుష్యాకారమువంటి
आदम-खोर, त्रि० पु० నరమాంస భక్షకుడు.
आदमगर, वि० దయగల; ज़ालिम
आदमचश्म, पु० మనుష్యునివలె నల్లని నేత్రములుగల గుఱ్ఱము
आदमजाद, पु० ఆదమ్ సంతానము; మానవుడు
आदमियत, स्त्री० మానవత్వము; పెద్దమనిషితనము
आदमी, पु० మనుష్యుడు; వ్యక్తి; నౌకరు
आदमीयत, स्त्री० दे० आदमियत
आदर, पु० గౌరవము; పూజ్యభావము; సత్కారము
आदरण, पु० సన్మానము; గౌరవించుట
आदरणीय, वि० గౌరవింపదగిన; సన్మానింపదగిన
आदरना, स० क्रि० గౌరవించుట; సన్మానించుట.
आदर्श, पु० अनुकरिंपदगिन पर मोत्कृष्टमैन पदार्थमु;
आदर्श పు० అనుకరింపదగిన పరమోత్కృష్టమైన పదార్థము; ఆదర్శము. అద్దము; మాదిరి; టీక
आदर्शवाद, पु० బాహ్యశూన్యవాదము; స్థూలప్రపంచము కల్లయనువాదము
आदर्शवादी, वि० బాహ్యశూన్య వాది; స్థూలప్రపంచము కల్లయనివాదించువాడు
आदर्श विज्ञान, पु० నీతిశాస్త్రము మొదలయినవి
आदर्शीकरण, पु० ఆదర్శముగా వ్యవహరించుట
आदहन, पु० చంపుట; శ్మశానము; నిందించుట; కాల్చుట.
आदात, स्त्री० आदत का बहु०
आदान, पु० రోగకారణము; పుచ్చుకొనుట;
आदान-प्रदान, पु० ఇచ్చిపుచ్చుకొనుట; మార్పిడి
आदाब, पु० శిష్టాచారము; నమస్కారము; अदब का बहु०
आदाब, अर्ज, पु० నమస్కారము,
आदाय, पु० తీసికొనుట; పొందుట; वि० పొందదగిన
आदि, वि० మొట్ట మొదటి; पु० ప్రారంభము; మూలకారణము; పరమేశ్వరుడు; अव्य० మొదలయిన

आदिक, మొదలయిన; వగైరహ్
आदितेय, पुं० దేవత; సూర్యుడు
आदित्य, पुं० సూర్యుడు; దేవత; ఇంద్రుడు
आदिम, वि० మొదటగాపుట్టిన; సర్వ ప్రథమము
आदिल, वि० న్యాయబుద్ధిగలవాడు; న్యాయీ
आदिमान, पुं० విశేషాధికారము; అధిక్యము
आदिष्ट, वि० ఆనతియ్యబడిన; ఉపదేశింపబడిన; पुं० ఎంగిలి; ఆనతి; సమ్మతి
आदी, वि० అలవాటుపడిన; వ్యసనముగల; स्त्री० అల్లము; अव्य० కొంచెము కూడా; బొత్తిగా
आदीनव, पुं० దుఃఖము; అలసట; తప్పు
आदीपन, पुं० ఉద్రేకింపజేయుట; గోడలకుసున్నము కొట్టించుట; ప్రకాశింపజేయుట; మంట చేయుట
आदृत, वि० ఆదరింపబడిన
आदेय, वि० సన్నువేయబడిన; గ్రహింపదగిన; సన్నువేయదగిన पुं० సులభముగాలభించిన ఆదాయము
आदेश, पुं० ఆజ్ఞ; జ్యోతిషమందలి గ్రహ ఫలము; అక్షరపరివర్తనము; వ్యాకరణమునందు ఒకవర్ణమునుబో గొట్టివచ్చు మరియొక వర్ణము; ఉపదేశము
आदेशक, पुं० ఆజ్ఞాపించువాడు; ఉపదేశించువాడు
आदेशन, पुं० ఆజ్ఞాపించుట; ఉపదేశించుట
आदेष्टा, पुं० ఆజ్ఞాపించువాడు; యజ్ఞతంత్రమునుపదేశించువాడు
आद्यंत, क्रि० वि० మొదటినుండి చివరివరకు
आद्य, वि० మొట్టమొదటి; ప్రథమ
आद्य-शेष, पुं० ప్రారంభపు నిలువడబ్బు Opening Balance
आद्योपांत, क्रि० वि० మొదటినుండి చివరివరకు
आद्रा, स्त्री० ఆరుద్రనక్షత్రము; आर्द्रा
आध, वि० సగభాగము; आधा
आधा, वि० సగభాగము; आध
आधान, पुं० అగ్నికార్యము చేయుట; స్థాపన; తాకట్టు; గర్భము
आधार, पुं० పాత్ర; ఆశ్రయము; మూలము; సప్తమీ విభక్తి; ఆదరువు; పునాది; పాదు
आधारिक वि० ఆధారమైన; మూలమైన; Basic
आधारित, वि० ఆధారపడిన; ఆశ్రయించిన
आधारी, वि० ఆధారపడియుండువాడు; సాధువుల చేతిదండము
आधासीसी, स्त्री० పార్శ్వపునొప్పి; अधकपारी
आधि, स्त्री० మనోవ్యథ; తాకట్టు

आधिक, वि० సగము; क्रि० वि० కొంచెము; రమారమిసగభాగము

आधिकारिक, वि० అధికారపూర్వకమైన; पुं० అధికారము; పరమాత్మ; అధికారి; మూలకథావస్తువు

आधिक्य, पुं० ఎక్కువ; వృద్ధి; గొప్పతనము; ప్రాధాన్యము

आधिदैविक, वि० దేవతాసంబంధమైన; దైవకృతము;

आधिपत्य, पुं० రాచరికము; అధికారము

आधिभौतिक, वि० పృథివ్యాదిభూతములవలన కలిగినది

आधीन, वि० స్వాధీనములోనున్న; ఆశ్రితుడు; ఆశ్రితము; పరాధీనుడు

आधीनता, स्त्री० స్వాధీనము: పరవశత్వము; పరాధీనుడగుట; దీనత్వము

आधु'नक, वि० ఇప్పటి; సరికొత్తది

आधृत, वि० ఆధారపడిన; अवलंबित

आधेय, वि० స్థాపింపదగిన; ఉంచదగిన; తాకట్టుపెట్టదగిన; ఆధారముమీదనుండునది पुं० ఆధారముమీదనున్న వస్తువు

आध्यात्मिक, वि० ఆత్మపరమాత్మలకు సంబంధించిన; ఆత్మవలనకలిగిన

आनंद, पुं० సంతోషము; సుఖము; ఒక సంవత్సరము; శివుడు; విష్ణువు

आनंदन, पुं० సంతోషపెట్టుట

आनंदना, अ० क्रि० సంతోషించుట; स० क्रि० సంతోషపరచుట

आनंदाश्रु, पुं० ఆనందబాష్పములు

आनंदित, वि० సంతోషించిన; సంతోషపెట్టబడిన

आन, स्त्री० శపథము; గౌరవము; జయభేరి; మర్యాద; ఠీవి; క్షణము; పద్ధతి, ఒట్టు; చాటింపు; మిడిసిపాటు; పట్టుదల; విజయఘోషము; గర్వము; మితి; वि० మరియొక; अन्य

आनक, पुं० గర్జించుమేఘములు; తప్పెట; మద్దెల; ఢంకా

आनत, वि० వంగిన; వినయముగలవాడు; నమస్కరించువాడు

आनतान, स्त्री० ఠీవి; మిడిసిపాటు; గౌరవము; అతకవిమాట

आनन, पुं० ముఖము; అధ్యాయము; నోరు

आननफानन, क्रि० वि० కనుమూసితెరచునంతలో; అతిత్వరగా; తక్షణమే

आनना, स० क्रि० తెచ్చుట, लाना

आनबान, स्त्री० ఒయ్యారము; తళుకుబెళుకు; అలంకారము

आना, अ० क्रि० వచ్చుట; పుట్టుట; లభించుట; రాబడివచ్చుట; पुं० ఒక అణానాణెము

आनाकानी, स्त्री० పెడచెవినిపెట్టుట; గుసగుసలు

आनुतोषिक, पुं० పారితోషికము

आनुपातिक, वि० తగిన; అనుగుణమైన; అనురూపమైన Proportionate.

आनुमानिक, वि० ఉజ్జాయింపుగా: కల్పితము

अनुलोमिक, वि० క్రమబద్ధము; తగిన: అనుకూలమైన

आनुवंशिक, वि० వంశపారంపర్యముగా లభించిన: పుశ్తేనీ

आनुषंगिक, वि० తప్పనిసరియైన; సంబంధముగల: సందర్భమునుబట్టి జరిగెడు

आनेता, वि० తెచ్చువాడు

आन्तरिक, वि० మానసికమైన; హృదయమునకు సంబంధించిన

आप, सर्व० తమరు; తాను; మీరు; వారు; पु० పరమాత్మ: నీరు; अव्य० స్వయముగా; తానుగా

आपकाज, पु० స్వంతపని; స్వార్థము

आपगा, स्त्री० నది; नदी

आपत्ति, स्त्री० ఆపద; ఆక్షేపణ

आपत्ति पत्र, पु० ఆక్షేపణ పత్రము లేక అర్జీ: Petition of objection

आपत्य, वि० సంతానమునకు సంబంధించిన

आपन, पु० పొందుట; చేరుట; सर्व० తనయొక్క

आपनपौ, } पु० అహంభావము; ఆత్మీయత: నిజస్వరూపము: ఆత్మగౌరవము; స్పృహ
आपनपो, }

आपना, सर्व० తనయొక్క: अपना

आपनिक, पु० ఇంద్రనీలమణి: కిరాతుడు; అనాగరికుడు

आपनिधि, पु० సముద్రము; सागर

आपन्न, वि० ఆపదలోనున్న; లభించిన; पु० రక్షింపువాడు

आप-बीती, स्त्री० స్వానుభవము

आपराधिक, वि० అపరాధ సంబంధమైన: Criminal

आप-रूप, वि० స్వయముగా; సాక్షాత్

आपस, पु० సంబంధము: పరస్పరసంబంధము

आपसी, वि० పరస్పర సంబంధమైన

आपा, पु० అహంభావము; చైతన్యము; నిజస్థితి

आपाक, पु० ఆవము: आँवाँ

आपात, पु० పతనము: అత్యవసరపరిస్థితి: పడవేయుట

आपातत:, क्रि० वि० అకస్మాత్తుగా: చివరకు; తక్షణమే

आपाधापी, स्त्री० పెనగులాట; వ్యక్తిగత వైరము లేక మాత్సర్యము

आपान पु० అనేకులుకూడికల్లు త్రాగెడు చోటు

आपी, वि० బలవంతుడు

आपु, सर्व० వారు; తమరు; తాను; మీరు

आपुन, } सर्व० తనయొక్క; స్వయముగా
आपुनो, }

आपूरना, अ० क्रि० నిండుట: स० क्रि० నింపుట

आपेक्षिक, वि० అపేక్షించువాడు; ఇతరులనాశ్రయించెడువాడు, సాపేక్షము

आप्त॰ वि० లభించిన; ప్రామాణికమైన; నమ్మదగిన; యదార్థమైన; హితమైన; పుం శబ్దప్రమాణము; ఆత్మీయుడు; నమ్మదగినవాడు

आप्य॰ वि० జలమయము; జలసంబంధమైన; లభించిన; పుం ఒక దేవవర్గము నీటినురుగు [నిచ్చుమందు

आप्यायन॰ पुं० తృప్తి; పెరుగుట; బలము

आप्यायित॰ वि० తృప్తినొందిన; బలవంతుడు; పెరిగిన [ఘునుక

आप्लव॰ पुं० స్నానము; తడుపుట;

आप्लाव, पुं० స్నానము; వరద

आप्लावन, पुं० ముంచుట; తడుపుట; స్నానము

आप्लावित, वि० ముంచబడిన; స్నానము చేసిన; తడుపబడిన

आप्लुत॰ वि० మునిగిన; స్నానము చేసిన; పుం స్నాతకుడు

आफ़त॰ स्त्री० ఆపద; దుఃఖము

आफ़तनसीब॰ वि० ఆపదలోనున్న

आफ़ताब॰ पुं० సూర్యుడు; ఎండ

आफ़ताबा॰ पुं० కొక్కెముగలనీటిపాత్ర

आफ़ताबी॰ वि० సూర్యసంబంధమైన; ఎండ వేడిమితో తయారుచేయబడిన పుం బాణాసంచా విశేషము; మూనెడు వస్తువు

आब॰ पुं० నీరు; కన్నీరు; చెమట; కల్లు; स्त्री० కాంతి; శోభ; ప్రతిష్ఠ, ఔన్నత్యము; పదును

आबकार॰ पुं० కల్లుగీచువాడు; సారాయిన మ్ముకవాడు; గవుండ్లవాడు

आबकारी॰ स्त्री० సారాయిఅమ్మెడి చోటు; కల్లు తయారుచేయు వృత్తి; ఎక్సైజు డిపార్టుమెంటు

आबकारी शुल्क, पुं० మత్తు పదార్థము లపై వేసెడిపన్ను; Excise dutv

आबख़ाना॰ पुं० పాయఖానా; पाखाना

आबखोरा॰ पुं० నీరుత్రాగుపాత్ర

आबगीना, पुं० పటిక; గాజు

आबगीर॰ पुं० చెరువు; గుంట; పడుగునూలుపై నీరు చల్లెడి సాలెవాని కుంచె

आबजोश॰ पुं० మాంసపుపులుసు; సోడానీరు; ఎండినద్రాక్షపండు

आबताब॰ स्त्री० తళుకు బెళుకు; వైభవము

आबदस्त, पुं० మలవిసర్జనము; గుదప్రక్షాళనపునీరు; గుదప్రక్షాళనము

आबदान॰ पुं० నీటిపాత్ర [కూడూగుడ్డ

आबदाना॰ पुं० జీవనాధారము;

आबदार, वि० కాంతిగల; పదునుగల; ప్రతిష్ఠగల; పుం త్రాగుటకునీరు అందించునౌకరు; ఫిరంగినితడిగుడ్డతో తుడుచువాడు

आबदारी, स्त्री० కాంతి; శోభ, ప్రకాశము

आबदीदा, वि० కంటతడిపెట్టిన; ఏడ్పుముఖము పెట్టిన

आबदोज़ वि० నీటిలోపల పోవునది (జలాంతర్గామి మొ); నీటిలోపలి

आबदोज किश्ती, स्त्री० జలాంతర్గామి; Submarine

आबद्ध, वि० బంధింపబడిన; ఖైదులోనున్న. पु० ప్రేమ; దృఢబంధనము

आबनूस, पु० ఎర్రకలప; Rosewood

आबपाशी, स्त्री० చేలకునీరు పెట్టుట; వల్లపుసాగు

आबमहकमा, पु० ఎక్సైజుడిపార్టుమెంటు

आबरवाँ, पु० మిక్కిలిసన్న నివస్త్రము

आबरू, स्त्री० గౌరవమర్యాదలు; పేరు ప్రతిష్ఠలు

आंबला, पु० బొబ్బ; छाला

आबशार, पु० సెలయేరు झरना

आबहवा, स्त्री० శీతోష్ణస్థితి; जलवायु

आबाद, वि० నివసించుచున్న; సారవంతమైన; దున్నదగిన; వర్ధిల్లుచున్న; సంపన్నమైన భూమి

आबादकार, पु० బంజరు భూమిసాగు చేయురైతు

आबादानी, स्त्री० నివాసస్థలము; సభ్యత; జనసంఖ్య; సంస్కృతి; అభ్యుదయము; సంతోషము

आबादी, स्त्री० జనసంఖ్య; వ్యవసాయ భూమి; గ్రామము; నివాసస్థలము

आबी, वि० జలసంబంధమైన; జలచరము; లేతనీలిరంగుగల

आबे खंजर, पु० కత్తి పదును

आबेज़र, पु० బంగారపుపూత

आबोहवा, स्त्री० శీతోష్ణస్థితి; जलवायु

आब्दिक, पु० తద్దినము; సాంవత్సరికము; वि० సంవత్సరాంతమున జరుగునది

आभ, स्त्री० శోభ; మిక్కిలి దీప్తి; पु० నీరు

आभरण, पु० ఆభూషణము; పోషించుట

आभा, स्त्री० శోభ; కాంతి; మిక్కిలిదీప్తి

आभार, पु० ఉపకారము; భారము; బాధ్యత

आभारक, आभारी, पु० కృతజ్ఞుడు; ఉపకృతుడు

आभास, पु० సంకేతము; ప్రకాశము; లేనిది ఉన్నట్లుతోచుట

आभिजात्य, पु० కులీనత్వము; పాండిత్యము సౌందర్యము

आभीर, पु० గొల్లవాడు; ఒకదేశము

आभीरपल्लि, आभीरपल्ली, स्त्री० గొల్లె పల్లె

आभीरी, स्त्री० గొల్లపడుచు; ఒకప్రాచీనభాష

आभुक्ति, स्त्री० ఒకనికి చెందియున్న స్థలము నందు మరియొకనికి సదుపాయము నిమిత్తము కలుగు హక్కు. Easement

आभूत, वि० పుట్టిన; उत्पन्न

आभूषण, पु० నగ; శృంగారము; అలంకారము

आभूषित॰ वि॰ నగలుధరించిన; శృంగారింపబడిన; శోభించుచున్న

आभोग॰ पु॰ ప్రయత్నము; పరిపూర్ణత్వము; తృప్తి; సుఖము;

आभ्यंतर॰, आभ्यंतरिक॰ वि॰ లోపలనున్న; లోపలిది

आमंत्रण॰ पु॰, आमंत्रणा॰ स्त्री॰ ఆహ్వానము; పిలుపు; సలహా;

आमंत्रित॰ वि॰ పిలువబడిన; ఆహ్వానింపబడిన; पु॰ వార్తాలాపము; పిలుచుట

आम॰ पु॰ మామిడిపండు లేక చెట్టు; అజీర్ణము; అజీర్ణమువలన వచ్చెడిజిగట; वि॰ సర్వసాధారణమైన; [చోటు

आमखास॰ पु॰ మహారాజులుకూర్చుండు

आम जलसा पु॰ బహిరంగసభ

आमद. स्त्री॰ రాబడి; లాభము

आमदनी॰ स्त्री॰ ఆదాయము; లాభము; రెవిన్యూ; దిగుమతిసరుకు

आमदरफ्त॰ पु॰ రాకపోకలు

आम दरबार पु॰ బహిరంగసమావేశము

आमदोखर्च॰ पु॰ ఆయవ్యయములు

आमन॰ स्त्री॰ ఒకపంట పండించుభూమి; ఒంటిపంటధాన్యము

आमना-सामना॰ पु॰ ఎదుర్కొనుట; కలిసికొనుట

आमने-सामने॰ क्रि॰ वि॰ ముఖాముఖి

आमरण॰ क्रि॰ वि॰ మరణపర్యంతము; బ్రతికినన్నాళ్ళు

आम-राय. स्त्री॰ ప్రజాభిప్రాయము; లోకమత

आमर्श॰ पु॰ సలహా

आमर्ष॰ पु॰ క్రోధము; ఓర్వలేనితనము

आमलक॰ पु॰ ఉసిరిక చెట్టు; ఉసిరికకాయ

आमलकी॰ स्त्री॰ చిన్న ఉసిరిక; ఫాల్గుణ శుక్ల ఏకాదశి

आमला॰ पु॰ दे॰ आमलक

आमलोग॰ पु॰ సామాన్య ప్రజలు

आमशूल. पु॰ కడుపునొప్పి

आमात्य॰ पु॰ మంత్రి; अमात्य

आमादगी॰ स्त्री॰ తత్పరత; సంసిద్ధత, జాగరూకత

आमादा. वि॰ సంపన్నుడు; తత్పరుడు

आमाल॰ पु॰ జపతపములు; కర్మసమూహము; ఆచారవ్యవహారములు పనులు; अमल का बहु॰

अमालनामा॰ पु॰ పనివారలనడవడికను గురించి వ్రాయురిజిష్టరు

आमाशय॰ पु॰ అన్నకోశము

आमास॰ स्त्री॰ వాపు; सूजन

आमिल पु॰ అధికారి; కార్యకర్త; वि॰ పుల్లని; నెరవేరిన

आमिष॰ पु॰ మాంసము; లోభము, లంచము; భోగము

आमिषाशी॰ पु॰ మాంసాహారి

आमी; स्त्री॰ మామిడిపిందె; अँबिया

आमीन॰ अव्य॰ తథాస్తు;

आमुक्त॰ वि॰ విసరివేయబడిన; పట్టుబడిన; విడువబడిన; తొడుగబడిన;

आमुख॰ पु॰ పీఠిక; ప్రస్తావన; ఆరంభము

आमुष्मिक॰ वि॰ పరలోకసంబంధమైన

आमूल, क्रि॰ वि॰ సమగ్రము; కూకటివ్రేళ్ళతో; పరిపూర్ణముగా; కడవెళ్ల

आमेज॰ वि॰ కలిసియున్న; युक्त

आमेजना॰ स॰ क्रि॰ కలుపుట; मिलाना

आमेजिश॰ पु॰ మిశ్రణము; मिलावट

आमोद॰ पु॰ సంతోషము సువాసన

आमोद-प्रमोद॰ पु॰ భోగవిలాసము;

आमोदित॰ वि॰ సంతోషించిన; సువాసనగల

आम्र, पु॰ మామిడిచెట్టు; మామిడిపండు;

आम्रबन॰ पु॰ మామిడితోట; अमराई

आम्ल॰ पु॰ చింతచెట్టు; పులుపు

आम्ला, स्त्री॰ చింతపండు; పులుపు

आम्लिका॰ } स्त्री॰ చింతపండు;
आम्लीका॰ } పుల్లని త్రేపు; చింతచెట్టు

आयंदा, क्रि॰ वि॰ ఇకముందు; భవిష్యత్తులో

आय॰ स्त्री॰ ఆదాయము; లాభము; पु॰ ఆగమనము; అంతఃపురకాపలవాడు

आय का चिट्ठा॰ पु॰ రాబోవు సంవత్సరమునకుసుమారైన రాబడి ఖర్చుల మదింపులెక్క; Budget

आयत॰ पु॰ సమకోణచతుర్భుజము; సూర్యకిరణములు; సూర్యకాంతి स्त्री॰ కురానులోని ఒకవాక్యము; గురుతు; वि॰ పొడవైన; విశాలమైన

आयतन॰ पु॰ ఇల్లు; దేవాలయము; యజ్ఞముచేయుచోటు; వైశాల్యము;

आयति,॰ स्त्री॰ భవిష్యత్తు; నిడుపు; విస్తారము;

आयत्त॰ वि॰ ఆధారపడిన; ఆధీనము; అధీనుడు

आय-व्यय, पु॰ రాబడి-ఖర్చులు

आय-व्ययिक॰ पु॰ రాబడి-ఖర్చులెక్క (Budget)

आयस॰ पु॰ ఇనుము; ఇనుపవస్తువు; ఖడ్గము; स्त्री॰ ఆజ్ఞ; वि॰ ఇనుపది

आयसी, वि॰ ఇనుముతో చేయబడిన; पु॰ లోహకవచము

आयसु॰ स्त्री॰ पु॰ ఆజ్ఞ; आदेश

आया॰ स्त्री॰ దాది; ఆయువు; వయస్సు अ॰ क्रि॰ వచ్చెను; अव्य॰ ఏమిటి; ఒకవేళ; లేక

आयाचित॰ वि॰ కోరబడిన; అడుగబడిన; पु॰ అడుగుట; వేడుట

आयात॰ पु॰ దిగుమతిసరుకు; రాబడి; वि॰ వచ్చిన; దిగుమతి అయిన

आयाम॰ पु॰ నియమనము; విస్తారము; నిడుపు

आयामी॰ वि॰ నిడుపుగల; విస్తృతమైన; నియమించువాడు

आयास॰ पुं० శ్రమ; గట్టియత్నము; అలసట; పరితాపము

आयासी॰ वि० ప్రయత్నించెడు; అలసిన

आयु, स्त्री० వయస్సు; జీవితకాలము

आयुक्त॰ वि० నియమింపబడిన; సంయుక్తము; पुं० గుమాస్తా; కార్యదర్శి

आयुष्कर॰ वि० ఆయువును వృద్ధి చేయునది [వాడు

आयुष्काम॰ वि० దీర్ఘాయువు నపేక్షించు

आयुष्मान॰ वि० దీర్ఘాయువుగల; చిరంజీవి

आयोजक॰ वि० సంగ్రహించువాడు; ఏర్పాటు చేయువాడు; ప్రయత్నించువాడు

आयोजन॰ पुं० సామగ్రి; ఏర్పాటు ప్రయత్నము; సంగ్రహించుట

आरंभतः॰ क्रि० वि० మొదటినుండియు; సరిక్రొత్తగా

आरभना॰ अ० क्रि० ప్రారంభమగుట, स० क्रि० ప్రారంభించుట

आरंभिक॰ वि० మొదటిది; ప్రారంభికము

आर॰ स्त्री० శత్రుత్వము; ఏవగింపు; ఇనుపచీల; మొండిపట్టుదల, సిగ్గు; पुं० శనిగ్రహము; అంగారకగ్రహము; తేలు మొ॥ వానికొండి; ఒడ్డు; కొన; కోణము

आरक्त॰ वि० కొంచెమెరుపురంగుగల; గులాబిరంగుగల; पुं० ఎఱ్ఱచందనము

आरक्ष, पुं० రక్షణము; సేన; కుంభస్థలములసంధి; वि० రక్షింపబడిన

आरक्षक॰ पुं० కాపలావాడు; పోలీసు

आरक्षा॰ स्त्री० दे० आरक्ष

आरक्षिक॰ वि० పోలీసు సంబంధమైన; पुं० పోలీసు; కాపలావాడు

आरक्षिक क्रिया॰ स्त्री० పోలీసుచర్య; Police Action

आरक्षी॰ पुं० పోలీసు డిపార్టమెంటు; పోలీసు అధికారి; పోలీసు డిపార్టు మెంటువిధులు బాధ్యతలు; वि० రక్షించునట్టి

आरज पुं० పూజ్యుడు; वि० శ్రేష్ఠము; పూజింపదగిన

आरजा॰ पुं० క్లేశము; రోగము

आरजू॰ स्त्री० ప్రార్థన; కోరిక; వేడుకొనుట

आरजूमंद॰ वि० కోరికగల; ఇచ్ఛుక

आरत॰ वि० దుఃఖమునొందిన; ఆగిన; శాంతిబొందిన

आरति॰ स्त्री० విరక్తి; అడ్డంకి; దుఃఖము; కర్పూరహారతి [గానము

आरती॰ स्त्री० కర్పూరహారతి; మంగళ

आर-पार, पुं० ఇరువైపులనున్న నదిఒడ్లు; क्रि० वि० ఇరువైపుల; ఒకవైపు నుండి మరొకవైపుకు

आरब्ध, वि० ఆరంభింపబడిన

आरब्धि॰ स्त्री० ప్రారంభము; ప్రయత్నము

आरभट॰ पुं० ధైర్యవంతుడు, ధైర్యము
आरभटी, स्त्री० సాహసము ఒకకావ్య వృత్తి
आरसी॰ स्त्री० అద్దము; స్త్రీలు కుడిచేతికి ధరించు అద్దముపొదిగిన ఉంగరము
आरा॰ पुं० చేరంపము; చెప్పులు కుట్టెడు సూది; అరె
आराइश॰ स्त्री० శృంగారము; అలంకరణ
आराकश॰ पुं० రంపముతో కోయువాడు
आराति॰ पुं० శత్రువు; दुश्मन
आराधक॰ वि० పూజించువాడు
आराधन, पुं० ఆరాధించుట; సేవించుట; సన్మానించుట; సంతోషపరచుట
आराधना॰ स्त्री० పూజ; సేవ; स० क्रि० ఆరాధించుట
आराधनीय॰ वि० పూజింపదగిన
आराधित॰ वि० పూజింపబడిన; సేవింపబడిన
आराध्य॰ वि० పూజింపదగిన; సేవింపదగిన; సన్మానింపదగిన
आराम॰ पुं० సుఖము; తోట; ఆరోగ్యము वि० ఆరోగ్యముగానున్న
आराम कुर्सी, स्त्री० పడకకుర్చీ, सुखासंदी
आरामतलब॰ वि० సోమరి; సుకుమారియైన; సుఖాపేక్షి
आरामगाह॰ स्त्री० पुं० శయనాగారము; విశ్రాంతిస్థలము
आरामतलब॰ वि० సోమరి; సుకుమారియైన; సుఖాపేక్షి
आरामिक॰ पुं० తోటమాలి बागवान
आरारूट॰ पुं० दे० अरारोट
आरास्तगी, स्त्री० అలంకరణ
आरी॰ स्त्री० చిన్నరంపము, కొనమూల; ఇనుపముల్లు, वि० నగ్నము; శూన్యము; అలసిన; విసుగుజెందిన
आरूढ, वि० పైకెక్కిన; కూర్చున్న; దృఢముగా నిర్ణయించుకొనిన
आरूढि॰ स्त्री० పైకెక్కుట
आरोग॰ वि० ఆరోగ్యముగానున్న
आरोग्य-विज्ञान॰ पुं० ఆరోగ్యశాస్త్రము
आरोचन॰ वि० కాంతిగల; మెరయుచున్న
आरोप, पुं० నేరారోపణము; లేనిది కల్పించుట; నాటుట; స్థాపించుట
आरोपक॰ वि० ఆరోపించువాడు; స్థాపించువాడు; నాటువాడు
आरोपण, पुं० స్థాపించుట; లేనిది కల్పించుట; పైకెక్కించుట; నాటుట; నమ్ముట; భ్రమ; విల్లుఎక్కుపెట్టుట
आरोपना॰ स० क्रि० నాటుట; స్థాపించుట; ఆరోపించుట
आरोप-फलक, पुं० నేరారోపణపత్రము; Charge Sheet
आरोपित॰ वि० ఆరోపింపబడిన; ఎక్కింపబడిన; నాటబడిన
आरोपी॰ पुं० ముద్దాయి, Accused

आरोह, पुं० ఎక్కుట; ఎక్కువాడు; ఎగుడు; ఆక్రమణము; నిడుపు; స్త్రీపిరుదు; సంగీతమందలి. ఆరోహణ క్రమము

आरोहण, पुं० ఎక్కుట; సోపానము; నిచ్చెన

आरोही, पुं० పైకి ఎక్కువాడు; సంగీత స్వరముల' క్రమము

आर्जव, पुं० ఋజుభావము; సరియగు నడవడిక [నున్న

आर्त, वि० దుఃఖమునొందిన; జబ్బుగా

आर्तव, पुं० స్త్రీఋతువు; పుష్పము; वि० ఋతుసంబంధమైన

आर्ति, स्त्री० దుఃఖము; రోగము; మనో వ్యథ; వింటికొప్పు; నాశము

आर्थिक, वि० నేర్పుగల; నిజమైన; శబ్దార్థసంబంధమైన; ధనసంబంధమైన

आर्द्र, वि० తడిసిన; ద్రవించిన

आर्द्रा, स्त्री० ఆరుద్ర నక్షత్రము

आर्य, वि० శ్రేష్ఠమైన; పూజ్యమైన

आर्ष, पुं० వేదము; ఒకవివాహభేదము; वि० వైదికము; ఋషికృతము; ఋషి సంబంధమైన

आलंकारिक, वि० అలంకారసంబంధ మైన; అలంకారయుక్తమైన; అలం కారశాస్త్ర వేత్త

आलंब, पुं० ఆధారము; శరణు; పట్టు; ఆశ్రయము; వ్రేలాడగట్టిన బరువు; లోలదండము, Pendulum

आलंबन, पुं० ఆధారము; పట్టు; ఆశ్ర యించుట; సాధనము; కారణము; రసోత్పత్తికల్గించు తత్వము

आलंबित, वि० ఆధారపడిన; ఆశ్రయిం చిన; వ్రేలాడుచున్న

आलंबी, वि० ఆశ్రయించెడు; ఆధార పడెడు

आल, स्त्री० సంతతి; వంశము; కుమార్తె సంతానము; पुं० కన్నీరు; తడి; జంజాటము; ఒకమొక్క; वि० విస్తృతము; అధికము

आलजाल, वि० అసంబద్ధమైన; వంకర టింకరగానున్న

आलपीन, स्त्री० గుండుసూది; कांटिका

आलम, पुं० ప్రపంచము; స్థితి; గుంపు

आलम आरा, वि० ప్రపంచమునకు అలంకారప్రాయమైన

आलम आश्कार, } वि० జగద్విదిత
आलम आश्कारा, } మైన

आलम आइना, वि० సర్వప్రియుడు; ప్రపంచమునకు పరిచితమైన

आलमगीर, वि० విశ్వవ్యాప్తమైన; విశ్వ విజేత

आलय, पुं० ఇల్లు; నివాసస్థానము ఆధారము; సంపర్కము; ఆశ్రయ స్థానము

आलवाल, पुं० చెట్లపాదు; थाला

आलस, पुं० సోమరితనము; वि० సో:

आलसी, वि० సోమరి; सुस्त

आलस्य॰ पुं॰ సోమరితనము; सुस्ती

आला, पुं॰ గోడలోనిగూడు; ఖడ్గము; పనిముట్టు; वि॰ మిక్కిలి ఎత్తైన; శ్రేష్ఠమైన; తడిగానున్న

आलान, पुं॰ గొలుసు; ఏనుగునుకట్టివేయు మేకు లేక స్తంభము లేక త్రాడు

आलाप॰ पुं॰ సంభాషణ; కథనము; రాగాలాపము; సప్తస్వరములు

आलापक॰ पुं॰ సంభాషించువాడు; గాయకుడు

आलापन॰ पुं॰ సంభాషించుట; ఆలాపించుట

आलापना॰ स॰ क्रि॰ రాగముతీయుట; వాడుట

आलापित, वि॰ చెప్పబడిన; పాడబడిన

आलापिनी॰ स्त्री॰ సొరకాయ బుఱ్ఱగల వీణ; तुमड़ी

आलापी॰ वि॰ మాట్లాడువాడు; గాయకుడు; రాగము తీయువాడు

आलिंगन, पुं॰ కౌగిలింత परिरंभण

आलिंगना, स॰ क्रि॰ కౌగిలించుకొనుట; भेंटना

आलिंगित॰ वि॰ కౌగిలింపబడిన

आलिंगी, वि॰ కౌగిలించువాడు; पुं॰ చిన్నడోలు

आलिंग्य. वि॰ కౌగిలింపదగిన; पुं॰ ఒక మృదంగము

आलि॰ पुं॰ తుమ్మెద; తేలు; स्त्री॰ పంక్తి; చెలికత్తె; రేఖ; వంశము; వంతెన; वि॰ నీచము; నిరర్థకము; నమ్మకముగల; సోమరియైన

आलिखित॰ वि॰ చిత్రింపబడిన; వ్రాయబడిన

आलिप्त॰ वि॰ అలుకబడిన; పూయబడిన

आलिम॰ पुं॰ విద్వాంసుడు; विद्वान्

आलिमा॰ स्त्री॰ విద్వాంసురాలు; विदुषी

आलिमाना॰ वि॰ విద్వాంసులవలె

आली॰ स्त्री॰ చెలికత్తె; పంక్తి; వంతెన; వంశము; రేఖ; वि॰ శ్రేష్ఠము; విశాలమైన; పెద్దది

आली ख़ानदान॰ वि॰ కులీనుడు; గొప్పయింటివాడు

आली जनाब, वि॰ హోదాగల; గొప్పపదవియందున్న

आलीजाह, वि॰ గొప్ప హోదాగల; గౌరవముగల; గొప్పపదవియందున్న

आलीज़र्फ़॰ वि॰ ఉదారహృదయుడు

आली दिमाग़॰ वि॰ బుద్ధిమంతుడు; बुद्धिमान

आली नज़र॰ पुं॰ ఉదారబుద్ధి; उदाराशय

आलीशान, वि॰ తళుకుబెళుకుగల; భవ్యమైన; ఠీవిగల; విశాలమైన; ఉత్తమమైన

अलुाल, वि॰ ఊగుచున్న; వణకుచున్న; అస్థిరమైన

आलू॰ पुं॰ బంగాళాదుంప; Potato

आलूचा॰ पुं॰ ఆలబకరాచెట్టు లేక పండు

आलूदगी॰ स्त्री॰ అపరాధము; మురికి; అపవిత్రము

आलूदा, वि० పూర్తిగామునిగిన; పూర్తిగా తడిసిన

आलू बुख़ारा, पुं० ఆలుబుకరాపండు; आरूक

आलेख, पुं० వ్రాత; జాబు; లిపి

आलेखन, पुं० వ్రాయుట; బొమ్మలు గీయుట

आलेखन विद्या, स्त्री० చిత్రకళ; चित्रकारी

आलेख्य, वि० చిత్రింపదగిన; వ్రాయదగిన; पुं० చిత్తరువు; వ్రాత

आलेप, पुं० లేపము; నలుగు; గచ్చు

आलेपन, पुं० పూతపూయుట; గచ్చు చేయుట; నలుగుపెట్టుట [చూపు

आलोक, पुं० వెన్నెల; కాంతి; వ్యాఖ్య;

आलोक-चित्रण, पुं० ఫొటోగ్రఫీ

आलोकन, पुं० కాంతి; ఎండ; చూపుట

आलोकनीय वि० చూడదగిన

आलोक-पत्र, पुं० జ్ఞాపకార్థము వ్రాసినది

आलोकित, वि० చూడబడిన; వెలుతురు గల; ప్రకాశించుచున్న

आलोचक, पुं० విమర్శకుడు; చూచువాడు

आलोचन, पुं० చూచుట; విమర్శ; పరికించుట

आलोचना, स्त्री० సమీక్ష; విమర్శ; వ్యాఖ్య; పరీక్షించుట; టీక; టిప్పణము

आलोचनीय, आलोच्य, } वि० సమీక్షింపదగిన; పరికింపదగిన

आलोचित, वि० సమీక్షింపబడిన; విమర్శింపబడిన

आलोड़न, पुं० పూర్ణవిమర్శనము; మధించుట; పరిశీలన; వ్యాకులత, తర్కవితర్కము

आलोड़ना स० क्रि० తర్కవితర్కము చేయుట; పరిశీలించుట; మధించుట; విమర్శించుట; వ్యాకుల పరచుట

आलोड़ित, वि० తర్కవితర్కము చేయబడిన; మధింపబడిన; విమర్శింపబడిన; పరిశీలింపబడిన

आलोल, वि० చంచలమైన; కొంచెముగా వూగుచున్న

आल्हा, पुं० మహోబాదేశపు వీరుడు; ఆల్హా; అతనితమ్ముడు ఊదల్ ల విస్తృతవర్ణన; వీరగాథ; ఒక ఛందస్సు

आव, स्त्री० జీవితకాలము; వయస్సు

आवज, पुं० ఢంకయనువాద్య విశేషము

आव-भगत, स्त्री० స్వాగతము; గౌరవ మర్యాదలు

आवरण, पुं० కప్పుట; మూత; చుట్టుముట్టుట; తెర; ఇంటినలువైపుల నుండు ప్రదేశము; పుస్తకపుఅట్ట; మూటకట్టుట కుపయోగించు వస్త్రము

आवरण पत्र, आवरण पृष्ठ, } पुं० పుస్తకపు పైనిఅట్ట

आवरित, वि० కప్పబడిన; చుట్టుకొనబడిన; మూయబడిన

आवर्त, आवर्त्त, पुं० సుడిగుండము; వల్లె వేయుట; గుట్టపుసుడి; వర్షించని మేఘము; वि० చుట్టుతిరిగిన; ముడుచుకొనిన

आवर्तन, आवर्त्तन, पुं० పాశముయొక్క వల్లె; మధ్యాహ్నకాలము; చుట్టు తిరుగుట; మరలుట

आवर्तयान, पुं० హెలికాప్టర్

आवलि, आवली, स्त्री० పంక్తి, పరంపర; వరుస

आवश्य, पुं० అగత్యము; అనివార్య కార్యము

आवश्यक, वि० తప్పనిసరియైన; జరూరీ

आवश्यकता, स्त्री० అగత్యము; జరూరత

आवह, वि० తెచ్చునట్టి; కలిగించునట్టి; పుట్టించునట్టి; पुं० వాతావరణము; వాయుమండలము

आवहन, पुं० సమీపమునకు తెచ్చుట

आवाँ, पुं० కుమ్మరిఆవము

आवागमन, आवागवन, आवागौन, पुं० సృష్టి; జననమరణములు; రాకపోకలు

आवाज़, स्त्री० ధ్వని; పిలుపు; గోల

आवाजा, पुं० ప్రసిద్ధి; వ్యంగ్యము

आवा-जानी, स्त्री० జన్మమరణములు

आवा-जाही, स्त्री० రాకపోకలు

आवादानी, स्त्री० నివాసస్థానము; నభ్యత; అభ్యుదయము; జనసంఖ్య; ఆధిక్యము

आवाप, पुं० పాదు; విత్తులుచల్లుట

आवारगी, स्त्री० పోకిరితనము; దేశద్రిమ్మరితనము

आवारजा, पुं० జమాఖర్చుల పుస్తకము; అవర్జా

आवारा, वि० దేశద్రిమ్మరి, పోకిరి; నీచుడు

आवारागर्द, वि० దేశద్రిమ్మరి

आवारागर्दी, स्त्री० దేశద్రిమ్మరితనము

आवाल, पुं० పాదు; థాలా

आवास, पुं० నివాసము; నివాసస్థానము; ఇల్లు

आवासिक, आवासी, वि० నివాసి

आवाह, पुं० వివాహము, ఆహ్వానము

आवाहक, पुं० పిలుచువాడు; ఆహ్వానించువాడు

आवाहन, पुं० పిలుచుట; ఆహ్వానించుట; మంత్రోచ్చారణ

आवाहना, स० क्रि० ఆహ్వానించుట

आवाहित, वि० పిలువబడిన; ఆహ్వానింపబడిన

आविद्ध, वि० తొలువబడిన; వంకరైన

आविध, पुं० బరమా; తొలిచెడి సాధనము; बरमा

आविर्भाव, पुं० వెల్లడి; పుట్టుక; అవతారము

आविर्भूत, वि० పుట్టిన; వెల్లడియైన; అవతరించిన

आविष्करण, पुं० ప్రకటనము; వెల్లడి; నూతన సృష్టి; నూతన కల్పన

आविष्कर्ता, पुं० నూతనకల్పనచేయువాడు; నూతనముగా కనిపెట్టినవాడు

आविष्कार, पुं० కనుగొనుట; నూతన కల్పన; బయలు పరచుట

आविष्कृत, वि० వెల్లడియైన; ప్రకటింపబడిన; కనుగొనబడిన;

आविष्ट वि० లీనమైన; ఆవేశముకొన్న; దయ్యము పట్టిన

आवृत, वि० చుట్టబడిన; దాచబడిన; కప్పబడిన; చుట్టుకొనబడిన

आवृति, स्त्री० ఆవరణము

आवृत्त, वि० తిరిగి చెప్పబడిన; తిరుగుడు పడిన

आवृत्ति, स्त्री० తిరుగుడు; వల్లెవేయుట; ప్రయోగము; పుస్తకసంస్కరణము

आवेग, पुं० అశాంతి; తొందరపాటు; ఉద్రేకము; తొట్రుపాటు

आवेज़, वि० ప్రేలాడుచున్న

आवेज़ा, पुं० ప్రేలాడువస్తువు; కర్ణాభరణ విశేషము

आवेज़िश, स्त्री० స్పర్థ; యుద్ధము; కలియబడుటు

आवेदक, पुं० నివేదించువాడు; మనవిచేసికొనువాడు; వాది

आवेदन, पुं० మనవి చేసుకొనుట; దావా; తెలుపుట

आवेदन-पत्र, पुं० దరఖాస్తు; అర్జీ

आवेदित वि० తెలుపబడిన; తెలియజేయబడినవాడు

आवेदी, पुं० दे० आवेदक

आवेद्य वि० నివేదింపదగిన; చెప్పదగిన

आवेश पुं० ఆవేశము; ప్రవేశము; కోపము; పిశాచబాధ

आवेष्टन, पुं० ఏదైనావస్తువుమీదిమరియొకటివేసిచుట్టుట; మూయుట; కప్పుట; చుట్టెడుగుడ్డ

आशंका, स्त्री० భయము; సందేశము;

आशंकित, वि० అనుమానము లేక భయముతో కూడుకొనిన; पुं० భయము; సందేహము;

आशंक, वि० భయములేక అనుమానము గలవాడు

आशना, पुं० ప్రేమికుడు; మిత్రుడు; ప్రేమపాత్రుడు; स्त्री० ఉంపుడుగత్తె वि० పరిచితమైన

आशनाई, स्त्री० ప్రేమ, స్నేహము; అనుచితసంబంధము

आशय, पुं० తాత్పర్యము; అభిప్రాయము; ఆధారము; కోరిక; మనస్సు; పడకయిల్లు; విశ్రాంతి

आशा, स्त्री० కోరిక; నమ్మకము;

आशातीत, वि० ఆశించినదానికంటె ఎక్కువైన

आशाबाद, पुं० ఉత్తమ భావన; సర్వమును మేలుకొరకే ఉద్దేశింపబడిన దనువాదము

आशावादी• वि० సర్వమును మేలుకొరకే ఉద్దేశింపబడిన దనువాడు; ఉత్తమభావనకలవాడు

आशिक़• पुं० అనురక్తుడు; ప్రేమికుడు

आशिक़ मिज़ाज, वि० ప్రేమాసక్తుడు; ఉల్లాసముగల

आशिक़ाना• वि० అనక్తునివలె; ప్రేమికునివలె; అనురాగముగల;

आशिक़ी, स्त्री० ప్రేమ; అనురాగము; इश्क

आशिष•, आशिस• पुं० ఆశీర్వాదము; కావ్యాలంకారవిశేషము; పాముకోర

आशु• वि० వేగముగల, क्रि० वि० వెంటనే; వేగముగా; पुं० ఎఱ్ఱజిలమవడ్లు; గుఱ్ఱము

आशुकवि पुं० అప్పటికప్పుడేకవిత్వము చెప్పువాడు

आशोब• पुं० విప్లవము; భయము; గందరగోళము

आशौच, पुं० అపవిత్రత; అంటు

आशौची• वि० అపవిత్రము; नापाक

आश्कार• वि० వెల్లడియైన; స్పష్టమైన

आश्कारा• वि० వెల్లడియైన; क्रि० वि० బహిరంగముగా

आश्म• वि० రాతితో చేయబడిన पुं० రాతిపనిముట్టు

आश्रय• पुं० ప్రాపు; ఆధారము; సహాయము; ఇల్లు; విశ్రాంతి స్థలము; సమీపము; సంబంధము

आश्रित• वि० ఆశ్రయింపబడిన; ఆశ్రయించిన

आश्लेषा• स्त्री० ఆశ్లేషనక్షత్రము

आश्वस्त• वि० ఓదార్పబడిన; ఉత్సాహముగల

आश्वास• पुं० అధ్యాయము; ఓదార్చుట; అభయ మిచ్చుట

आश्वासक• पुं० ఓదార్చువాడు; ప్రోత్సహించువాడు

आश्वासन• पुं० ఓదార్పు; ప్రోత్సహించుట

आश्वासित• वि० ఓదార్పబడిన; ప్రోత్సహింపబడిన

आश्विन• पुं० ఆశ్వయుజమాసము; कुआर

आश्विनेय• पुं० అశ్వినీదేవతలు; నకులసహదేవులు

आषाढ़ा• स्त्री० పూర్వాషాఢ ఉత్తరాషాఢ నక్షత్రములు

आषाढ़ी, स्त्री० ఆషాఢమాసపూర్ణిమ

आषाढ़ीय• वि० ఆషాఢ నక్షత్రములో పుట్టిన

आसंगी• वि० అనురక్తుడు; సంబంధముగల

आस, पुं० పీట; ధనస్సు; సమీపము; स्त्री० ఆధారము; కోరిక దిశ; ఆశ; నమ్మకము

आसक्त• स्त्री० సోమరితనము; आलस्य

आसकती, वि० సోమరియైన; ఆలసీ
आसक्त॰ वि० అనురక్తుడు; ఆశగొన్న; ముగ్ధుడగు [అనురక్తి
आसक्ति॰ स्त्री० అపేక్ష; ఆశ; ప్రేమ;
आसते॰ क्रि० वि० నెమ్మదినెమ్మదిగా; धीरे धीरे
आसन॰ पुं० పీట; కుర్చీ మొ॥ కూర్చొనెడిసాధనము; కూర్చుండుట; ఉనికి; దండెత్తిపోకనిలుచుట; కూర్చొనురీతి; ఆగుట;
आसनी॰ स्त्री० చిన్నఆసనము; కూర్చుండుట; చిన్న దుకాణము
आसन्न, वि० దగ్గరకువచ్చిన; సమీపమందున్న; అనుకొనియున్న; మృత్యువు సమీపించినవాడు; पुं० సామీప్యము; అస్తమించుసూర్యుడు; మృత్యువు
आसपास॰ क्रि० वि० న లు వై పు ల; అటునిటు; సమీపమున
आसमां, आसमान, पुं० ఆకాశము; స్వర్గము;
आसमानी॰ वि० నీ ల పు ర ం గు గ ల; ఆకాశసంబంధమైన; దైవికము; पुं० లేతనీలిరంగు स्त्री० తాటికల్లు
आसरा, पुं० ఆధారము; నమ్మకము; ఆశ; ఆశ్రయము; శరణు.
आसव, पुं० కల్లు; రసము; పూదేనె
आसा॰ स्त्री० ఆశ; నమ్మకము; కోరిక; पुं० వెండిలేక బంగారపుకాడ లేక దండము
आसाइश॰ स्त्री० విశ్రాంతి; సుఖము
आसान, वि० తేలికగానున్న; సులభము
आसानियत, आसानी, स्त्री० సౌలభ్యము; సౌకర్యము
आसामी, स्त्री० అస్వామీభాష; पुं० అస్వాంనివాసి; ఋణగ్రస్తుడు; రైతు; वि० అస్వాంకుచెందిన
आसार॰ पुं० జడివాన; లక్షణము
आसिक, पुं० ఖడ్గధారి; ఖడ్గము చే యుద్ధము చేయువాడు
आसिख, आसिखा॰ स्त्री० ఆశీర్వాదము
आसिफ, पुं० గాలిదుమారము; आंधी
आसिया॰ स्त्री० తిరుగలి; పెండిమర
आसीन, वि० కూర్చుండిన
आसीस, स्त्री० ఆశీర్వాదము
आसुर, वि० రాక్షస సంబంధమైన; దైవికము; पुं० రాక్షసుడు; ధనమిచ్చి కన్యనుకొని చేసికొనెడు వివాహము
आसुरी, वि० రాక్షస సంబంధమైన; स्त्री० రాక్షసస్త్రీ; నల్లావాలు; శల్య చికిత్స
आसुरी संपत्, स्त्री० అన్యాయార్జన
आसूदगी, स्त्री० తృప్తి; సంతోషము
आसूदा॰ वि० తృప్తిజెందిన; ధనవంతుడు
आसेब, पुं० కష్టము; ప్రేతబాధ; అపాయము
आसेबज़दा, वि० దయ్యముపట్టిన

आसोज,
आसोजा } पुं० ఆశ్వయుజమాసము

आसौं, क्रि० वि० ఈ సంవత్సరమున

आस्तां, पुं० ప్రవేశద్వారము; ఋష్యాశ్రమము; గడప

आस्तिक, पुं० భగవంతుడున్నాడని నమ్మువాడు

आस्तिकता, स्त्री० భగవంతునియందు నమ్మిక

आस्तीन, स्त्री० చొక్కా-చేయి; बाँही

आस्ते, क्रि० वि० నెమ్మదిగా; आहिस्ता

आस्त्र, वि० అస్త్రసంబంధమైన

आस्था, स्त्री० ఉనికి; నమ్మకము; కోరిక; లక్ష్యము; శ్రద్ధ; సభ; ఆధారము; ఆశ; ప్రయత్నము; గౌరవభావము

आस्थान, पुं० సభ; రాజసభ; స్థానము; దర్బారు

आस्पद, पुं० స్థానము; వంశము; ప్రతిష్ఠ; వంశపుపేరు

आस्वाद, पुं० మంచిరుచి; రసానుభవము

आस्वादन, पुं० రుచిచూచుట; తినుట; అనుభవించుట

आस्वादित, वि० రుచిచూడబడిన; అనుభవింపబడిన

आस्वादु, वि० రుచిగల

आस्वाद्य, वि० రుచిచూడదగిన; రుచిగల

आह, स्त्री० నిట్టూర్పు; దుఃఖాసూచకశబ్దము; क्रि० वि० ఆహా! అయ్యో; पुं० సాహసము; క్రోధము; బెదరింపు

आहट, स्त्री० కాలిచప్పుడు; అలికిడి

आहत, वि० గాయపడిన; మ్రోగింపబడిన

आहति, स्त्री० దెబ్బ; వధ

आहन, पुं० ఇనుము; लोहा

आहर, पुं० సమయము; యుద్ధము

आहव, पुं० ఆహ్వానము; యుద్ధము; యజ్ఞము; బెదరింపు

आहवन, पुं० యజ్ఞము; హవిస్సు

आहार्य, पुं० నాయికానాయకులు ఒకరి వేషము మరియొకరు వేసుకొనుట; అభినయ విశేషము; वि० తినదగిన; తీసుకొనదగిన; తెచ్చుకొనదగిన

आहिस्ता, क्रि० वि० నెమ్మది నెమ్మదిగా; మెల్లగా

आहुत, पुं० భూతయజ్ఞము; అతిథిసత్కారము; वि० అగ్నియందు వేల్వబడిన

आहुति, स्त्री० త్యాగము; హోమము; హోమములో వేయు సామగ్రి; సవాలు చేయుట; బలి

आहूत, वि० పిలువబడిన; ఆహ్వానింపబడిన

आहूति, स्त्री० పిలుచుట

आह्लाद, पुं० సంతోషము; हर्ष

आह्लादन, पुं० సంతోషపరచుట; वि० సంతోషపెట్టెడు

आह्लादित, वि० సంతోషముగల

आह्लादी, वि० సంతోషపెట్టెడు; సంతోషముగల

कबर, स्त्री० గోరీ; శవమును పూడ్చుగుంట

क़बरस्तान, पुं० గోరీలదొడ్డి; శ్మశానము

कबरा, वि० పలువన్నెలుగల

क़ब्रिस्तान, पुं० గోరీలదొడ్డి; శ్మశానము

कबरी, स्त्री० స్త్రీలకొప్పు; वि० स्त्री० పలువన్నెలుగల

कबाड़, पुं० వ్యర్థమైనపని; చెత్తచెదారము; పనికిరాని వస్తువులు

कबाड़ा, पुं० గందరగోళము; వ్యర్థప్రసంగము; పోట్లాట

कबाड़िया, कबाड़ी, पुं० పనికిరాని లేక పాత వస్తువుల నమ్మువాడు; కలహప్రియుడు

कबाब, पुं० ఇనుప చువ్వలకు గ్రుచ్చి కాల్చిన మాంసము; वि० వేయింపబడిన

कबाबचीनी, स्त्री० తోకమిరియములు; చలవమిరియములు

कबाबी, वि० మాంసవిక్రేత; మాంసాహారి; మాంసమును వేయించువాడు

क़बायल, पुं० बहु० కుటుంబ సభ్యులు

कबार, पुं० వృత్తి; పనికిరాని సామగ్రి; వ్యర్థపుపని [उखाड़ना

कबारना, स० क्रि० పెల్లగించుట;

कबाला, पुं० విక్రయపత్రము; దస్తావేజు; అధికారపత్రము; దానపత్రము

क़बालानवीस, वि० దస్తావేజులు వ్రాయువాడు

क़बालानवीसी, स्त्री० దస్తావేజులు వ్రాయువృత్తి

कबाहट, क़बाहत, स्त्री० ఇబ్బంది; కష్టము; దోషము

कबीर, पुं० కబీరుదాసు [వి. శ. 1456-1575]; హోలీపండుగకు పాడు అశ్లీలగీతము; మహాపాతకము; वि० శ్రేష్ఠమైన; పూజ్యుడు

क़बील, पुं० మనుష్యుడు; ముఠా; సముదాయము

क़बीला, स्त्री० భార్య; पुं० వంశీకుల వర్గము; సమూహము

कबूतर, पुं० పావురము; గువ్వ

कबूतरखाना, पुं० పావురముల గూడు

कबूतरबाज़, पुं० పావురముల మోజుగా పెంచువాడు

कबूतरबाजी, स्त्री० కపోతక్రీడ; పావురముల పెంచుట

क़बूल, पुं० అంగీకారము; మంజూరు

क़बूलना, स० क्रि० అంగీకరించుట, మంజూరుచేయుట

क़बूल सूरत, वि० అందమైన; సుభగ

क़बूलियत, स्त्री० వ్రాతపూర్వకమైన అంగీకారపత్రము

क़बूलीयत, स्त्री० दे० क़बूलियत

क़ब्ज़, पुं० మలబద్ధకము; అవరోధము; పట్టుకొనుట; అధికారము; స్వాధీనము

क़ब्ज़ा, पुं० మరబందు, అధికారము; వశము; ఆక్రమణము; పిడికిలి

क़ब्ज़ियत॰ स्त्री॰ మలబద్ధకము
क़ब्र, स्त्री॰ గోరీ; శవమును పూడ్చు గుంట
क़ब्रगाह॰ स्त्री॰ } గోరీలదొడ్డి: శ్మశానము
क़ब्रिस्तान पु॰ }
कभी॰ क्रि॰ वि॰ ఎప్పుడైనా: అరుదుగా
कमंगर॰ पु॰ ధనుస్సులు తయారుచేయువాడు; కళాకారుడు: చిత్రకారుడు; నేర్పరి; విరిగిన లేక కీలుతప్పిన యెముకలను కుదుటబెట్టి కట్టువాడు
कमंगरी॰ स्त्री॰ చిత్రకళ; ధనుస్సులు తయారుచేయు వృత్తి లేక విద్య; విరిగిన లేక కీలుతప్పిన యెముకలను కుదుట బెట్టికట్టుట
कमडल॰ पु॰ సన్యాసుల జలపాత్ర: कमडलु
कमंडली, वि॰ సాధువు: కమండలధారి; మోసగాడు; पु॰ బ్రహ్మ
कमंडलु॰ पु॰ సన్యాసుల జలపాత్ర; कमंडल
कमंद, पु॰ दे॰ कबंध: स्त्री॰ ఎత్తైన యిండ్ల పైకెక్కుటకు దొంగలుపయోగించు త్రాటి నిచ్చెన: వన్య మృగముల పట్టెడు ఉచ్చుల త్రాడు
कम, वि॰ కొంచెము; చిన్న: తక్కువ: చెడ్డ क्रि॰ वि॰ అరుదుగా
कमख़र्च॰ वि॰ పొదుపుచేసెడు; किफ़ायती
कमख़र्ची, स्त्री॰ పొదుపు: किफ़ायत
कमख़ाब॰ पु॰ అల్లికపనిగల ఒకపట్టు వస్త్రము
कमख़ोर॰ वि॰ మితముగా భుజించువాడు
कमख़्वाब॰ पु॰ दे॰ कमख़ाब
कमगो, वि॰ మితభాషి: अल्पभाषी
क़मची॰ स्त्री॰ రెమ్మ: బెత్తము: చువ్వ కమ్మి
कमज़र्फ़, वि॰ నీచము: తుచ్ఛము
कमज़ोर॰ वि॰ బలములేని; శక్తిలేని
कमज़ोरी॰ स्त्री॰ బలహీనత: శక్తిలేమి
कमठ॰ पु॰ తాబేలు: కమండలము: వెదురు
कमठा, पु॰ ధనుస్సు: कमान
कमठी॰ स्त्री॰ ఆడతాబేలు: కొయ్యముక్క
कमती॰ स्त्री॰ తరుగు; లోటు: నష్టము: वि॰ తక్కువైన
कमनसीब॰ वि॰ దురదృష్టవంతుడు; अभागा
कमनसीबी॰ स्त्री॰ దురదృష్టము; दुर्भाग्य
कमनी, } वि॰ మనోహరమైన
कमनीय॰ }
कमनैत॰ पु॰ విలుకాడు: तीरंदाज
कमनैती, स्त्री॰ విలువిద్య: तीरंदाजी
कमफ़हम॰ वि॰ అల్పబుద్ధియైన
कमफ़हमी, स्त्री॰ అల్పబుద్ధి: మూర్ఖత్వము
कमफ़ुर्सत॰ वि॰ తీరికలేని
कमफ़ुर्सती॰ स्त्री॰ తీరికలేమి
कमबख़्त॰ वि॰ దౌర్భాగ్యుడు; हतभाग्य

कमबख्ती॰ स्त्री० దౌర్భాగ్యము: బద-నసీబీ

कमर॰ स्त्री० నడుము: మధ్యభాగము

कमरबंद पु० బెల్టు; పట్కా: నడుము కట్టు: నాడా: वि० సన్నద్ధుడైన

कमरबंदी॰ स्त्री० సన్నద్ధత: मुस्तदी

कमरबस्ता॰ वि० తయారుగానున్న: సిద్ధముగానున్న

कमरा, पु० గది; కంబళి

कमरिया, स्त्री० నడుము: చిన్నకంబళి; पु० పొట్టి యేనుగు

कमरी॰ स्त्री० చిన్నకంబళి; పద్మముల సమూహము

कमल, पु० పద్మము: రాగి: తామర: నీరు; ఒకజింక: కనుగ్రుడ్డు; పచ్చకామెర్ల రోగము

कमल-गट्टा॰ पु० తామర విత్తనము

कमलनाल॰ पु० తామరతూడు

कमलबाई, स्त्री० పచ్చకామెర్లరోగము पीलिया

कमला॰ स्त्री० లక్ష్మి: సుందరి; సిరి సంపదలు, కమలా ఫలము; पु० ఒకచీడపురుగు

कमलाकर, पु० సరస్సు; పద్మముల సమూహము

कमलालया॰ स्त्री० లక్ష్మి: लक्ष्मी

कमलासन॰ पु० బ్రహ్మ; పద్మాసనము

कमलिनी॰ स्त्री० చిన్నకమలము; తామరతూడు; తామరకొలను

कमली, पु० బ్రహ్మ: स्त्री० చిన్నకంబళి; పద్మసమూహము

कमसमझ॰ वि० మూర్ఖుడు: मूर्ख

कमसिन॰ वि० చిన్నవయస్సుగల; पु० బాలుడు

कमसिनी॰ स्त्री० చిన్నవయస్సు

कमसुखन॰ वि० మితభాషి: अल्पभाषी

कमसुखनी, स्त्री० మితభాషణము;

कमाँकश॰ वि० ధనుర్ధరుడు: कमाँगीर

कमाँगर, वि० ధనుస్సులు తయారు చేయువాడు

कमाँगीर, वि० ధనుర్ధరుడు: कमाँकश

कमाई॰ स्त्री० కష్టార్జితము; సంపాదించిన ధనము

कमाऊ॰ वि० కష్టించిపని చేయువాడు; ధనార్జనచేయువాడు

कमाच॰ पु० ఒకపట్టువస్త్ర విశేషము

कमाची॰ स्त्री० చువ్వ; సన్నది వెదురు చువ్వ: ధనుస్సువలె వంగిన చువ్వ

कमान॰ स्त्री० ధనుస్సు: ఆజ్ఞ: ఆర్చి; ఫిరంగి; తుపాకు: ఇంద్ర ధనుస్సు; మిలటరీ యుద్యోగము

कमानचा, पु० చిన్న విల్లు: దూదేకుటకు; తీగవాయిద్యము వాయించుటకుపయోగించు విల్లు

कमाना॰ स० क्रि० ధనార్జనచేయుట: పొలము; తోళ్ళు: పాయిఖానా మొ॥ శుభ్రముచేయుట

कमानिया॰ पुं० విలుకాడు; वि० ధనుస్సువలె వంగియున్న ఆర్చిగల
कमानी॰ स्त्री० వరిబీజమును మీదికినొక్కి పట్టునట్లు నడుమున కట్టుకొనుపటకా; కమాను; బిస; జోరుతీగ; విల్లువలె వంగియున్న వస్తువు
कमाल॰ पुं० పరిపూర్ణత్వము; నైపుణ్యము; కబీరుదాసుకుమారుడు; ఆశ్చర్యము; అద్భుతకార్యము; वि० సర్వోత్కృష్టమైన; సంపూర్ణము; అతిశయము
कमालियत, स्त्री० నైపుణ్యము; పరిపూర్ణత
कमी॰ स्त्री० లోపము; దారిద్ర్యము; అల్పత్వము; కొరత; నష్టము
कमीज़॰ स्त्री० చొక్కా; कुरता
कमीना॰ वि० నీచమైన; नीच
कमीनापन॰ पुं० నీచత్వము; नीचता
कमेरा॰ पुं० కూలివాడు; నౌకరు
कमोदन॰ }
कमोदिन॰ } स्त्री० తెల్లకలువ; कुमदिनी
कमोरा॰ पुं० మట్టికుండ; मटका
कमोरी॰ स्त्री० మట్టికుండ; మట్టిపిడత; मटकी
कम्मल॰ पुं० కంబళి; कंबल
कम्र॰ वि० మనోహరమైన; స్త్రీకాముకుడు
कया, स्त्री० శరీరము; काया
क़याफ़ा॰ पुं० ఆకారము; शकल
क़याफ़ा शनास॰ }
क़याफ़ा शिनास, } पुं० మనిషి యొక్క తీరు చూచి మనోభావములతెలుసుకొనువాడు
क़याम॰ బిస; విశ్రాంతిస్థలము, స్థిరత్వము
क़यामत॰ स्त्री० ప్రళయము; ఉపద్రవము; ఆపద; మహమ్మదీయుల; క్రైస్తవులమతానుసారము శవములు లేచి నిలువగా భగవంతుని ఎదుట వారివారికర్మలు వివరింపబడుదినము
क़यास॰ पुं० అంచనా; కల్పన
क़यासी॰ वि० కల్పింపబడిన; అంచనా వేయబడిన
करंजा॰ पुं० కానుగు చెట్టు वि० పిల్లి కళ్లుగల
कर॰ पुं० కిరణము; ఏనుగు తొండము; చేయి; కప్పము; సిస్తు प्रत्य యొక్క
करक॰ पुं० కొమ్మపాత్ర; దానిమ్మ; కమండలువు; स्त्री० ఉండియుండి కల్గునొప్పి.
करकट॰ पुं० చెత్త చెదారము; क़ूड़ा
करकना॰ अ० क्रि० పెళపెళవిరుగుట; ఉరుముట; గ్రుచ్చుకొనుట
करकरा॰ वि० గరుకుగానున్న; గట్టిగానున్న
करकराहट॰ स्त्री० పెళపెళమనెడిధ్వని; కటుకుదనము; గట్టితనము; కంటినలకవలన కలుగునొప్పి
करखना॰ अ० क्रि० ఆవేశపడుట

करखाना, अं क्रिं కాటుకకలిగి యుండుట; వల్లబడుట సం క్రిం కాటుకపూయుట

करगस॰ पुं బాణము, గ్రద్ద; రాబందు

करगह॰ पुं మగ్గము; करघा

करग्रह॰ पुं వివాహము; ब्याह

करघा॰ पुं మగ్గము; करगह

करचंग॰ पुं తప్పెట

करछा॰ }
करछी॰ } पुं పెద్దగరిటె; తెడ్డు; గంటె
करछुल॰ }

करजा॰ पुं అప్పు; कर्जा

करण॰ पुं కారణము; ఖడ్గము; పని; తృతీయా విభక్తి; పనిముట్టు; ఇంద్రియము; శరీరము; చెవి; పరమాత్మ

करणीय॰ वि॰ చేయదగిన [గారడి

करतब॰ पुं పని; నైపుణ్యము; కళ;

करतबिया॰ } वि॰ నైపుణ్యముగల;
करतबी॰ } గారడిచేయునట్టి; గుణవంతుడైన

करतरी॰ स्त्री॰ కత్తి; కత్తెర; చప్పట్లుకొట్టుట

करतल॰ पुं అరచేయి; हथेली

करतार॰ पुं భగవంతుడు; కర్త; చప్పట్లు

करतारी॰ स्त्री॰ ఈశ్వర లీల; చప్పట్లు; కర్తృత్వము; वि॰ భగవంతుని సంబంధమైన

करताल॰ पुं చప్పట్లు కొట్టుట; చేతులతో తాళము వేయుట; మంజీరావాద్యము

करतूत॰ } स्त्री॰ హస్తలాఘవము;
करतूति, } పని; నింద్యకర్మ; కళ; గుణము

करतूती॰ वि॰ హస్తలాఘవము చేయునట్టి; स्त्री॰ दे॰ करतूत

करद॰ वि॰ పన్ను చెల్లించువాడు; पुं రైతు; स्त्री॰ చాకు; కత్తి; సహాయపడువాడు

करधन॰ } स्त्री॰ ఒడ్డాణము;
करधनी॰ } మొలత్రాడు

करनफूल॰ पुं కర్ణాభరణము; तरौना

करनबेध॰ पुं చెవులుకుట్టించుట

करना॰ स॰ क्रिं చేయుట; पुं పని; సుదర్శనమనెడి తెల్లపూల మొక్క

करनाई॰ स्त्री॰ బాకా; కొమ్ముబాద్యము; तुरही

करनाटकी॰ पुं కర్ణాటక నివాసి, గారడివాడు; स्त्री॰ కన్నడభాష; वि॰ కర్ణాటకసంబంధమైన

करनी, स्त्री॰ అంత్యక్రియలు; తాపీ; పని

करपत्र॰ पुं రంపము; आरा

करपर॰ पुं తలపుర్రె; वि॰ పిసినిగొట్టు

करपल्लव॰ पुं వ్రేలు; उँगली

करपल्लवी॰ स्त्री॰ చేతి వ్రేళ్ళ సంకేతములతో శబ్దలేక భావముల ప్రకటించువిద్య

करपाल॰ पुं० ఖడ్గము तलवार
करपीड़न॰ पुं० వివాహము; शादी
करबरना॰ अ० क्रि० (పక్షులు) కలరవముచేయుట
करबला॰ पुं० పీరు లభించనిచోటు; శవముల పూడ్చుచోటు; ముసల్మాన్ పీరుడు హుసేన్ చంపబడిన అరేబియాయందలి ఒక ప్రదేశము
करबी॰ स्त्री० చొప్ప; జొన్నదంటు
करभ॰ ఒంటె పిల్ల; గున్న యేనుగు;
करभी॰ स्त्री० ఆడు ఒంటె; ऊँटनी पुं० ఏనుగు
करम॰ पुं० క్యారము; అదృష్టము; కర్మఫలము
करमकल्ला॰ पुं० కోసుకూర (క్యాబేజి)
करमचंद॰ पुं० అదృష్టము; కార్యము
करमट्ठा॰ वि० పిసినిగొట్టు; कंजूस
करमठ॰ वि० కర్మనిష్ఠుడు; పనిలో నేర్పరి
करमात॰ पुं० అదృష్టము; పని
करमाला॰ स्त्री० జపమునందు మాలవలె వుపయోగపడునట్టి చేతి వ్రేళ్ళ గణుపులు
करमाली॰ पुं० సూర్యుడు; सूरज
करमुहाँ॰ करमुखा॰ } वि० కళంకితమైన; నల్లని ముఖముగల; అపకీర్తిగల; దౌర్భాగ్యుడు (ఒకతిట్టు)
कररना॰ अ० क्रि० పెళపెళమనివిరుగుట; కర్రకర్రధ్వనికల్గుట

कर्रान, వింటినారియొక్క ధ్వని
करल, पुं० బాణలి; कड़ाही
करवट॰ स्त्री० ఒత్తిగిలిపరుండుట; पुं० అంపము
करवत॰ पुं० అంపము; आरा
करवर॰ स्त्री० ఆపద; ఇబ్బంది; దెబ్బ; पुं० ఖడ్గము
करवरना॰ अ० क्रि० పక్షులు కలరవము చేయుట
करवा, पुं० సన్నని మెడగలకొమ్ము కూజాలేక పాత్ర
करवार॰ स्त्री० ఖడ్గము; तलवार,
करवाल॰ पुं० ఖడ్గము; గోరు
करवीर पुं० కత్తి; శ్మశానము
करवैया॰ पुं० చేయువాడు; గారడి చేయువాడు
करश्मा॰ पुं० వింతపని; కంటిసైగ; అద్భుతకార్యము
करष, पुं० स्त्री० } ద్వేషము; ఉద్రేకము; ఆకర్షణ; కోపము; ఈడ్పు
करषना॰ स० क्रि० ఎండబెట్టుట; ఈడ్చుట; చాచుట; ఆకర్షించుట; పిలుచుట
करसी॰ स्त्री० పిడక; పిడకనిప్పు; పిడకనుసి; కచ్చిక
करह॰ पुं० ఒంటె; మొగ్గ
करहाट॰ करहाटक॰ } पुं० తామర దుంప
करांकुल, पुं० క్రౌంచ పక్షి क्रौंच
करांती, पुं० రంపము లాగువాడు

क़राबा॰ पुं० అరకు మొ॥ నవివుంచు గాజుపాత్ర; గాజుకూజా

करामत· स्त्री० వింత; గొప్పతనము; అనుగ్రహము; మహాత్మ్యము

करामात॰ स्त्री० గారడి; వింతపనులు; करामत का बहु०

करामाती॰ वि० వింతపనులుచేయువాడు; గారడి సంబంధమైన

करार· पुं० ఎత్తైననదిఒడ్డు; कगार

क़रार॰ पुं० ఒప్పందల; ధైర్యము; ప్రతిజ్ఞ; సంతృప్తి; సుఖము; విశ్రాంతి; స్థిరత్వము

क़रारदाद॰ पुं० నిర్ణయము; నిర్ణీతవిషయము

करारना॰ अ० क्रि० కర్కశముగామాట్లాడుట; కావుకావుమని అరచుట (కాకి)

करारा॰ पुं० ఎత్తైన నదిఒడ్డు; కాకి; మట్టిదిబ్బ; वि० గట్టియైన; లోతైన; దృఢమైన; తీక్ష్ణమైన; కరకరలాడునట్లు వేగింపబడిన

कराल॰ वि० భయంకరమైన; डरावना

कराला॰ स्त्री० భయంకరస్వరూపిణియైనకాళి

करावल॰ पुं० వార్తాహరుడు; వేటగాడు

क़रावली॰ स्त्री० కిరణసమూహము

राहना· अ० क्रि० బాధతోమూల్గుట

राहियत· स्त्री० అయిష్టము; ఏవగింపు

राही॰ स्त्री० చిన్నబాణలి; కడవ

करिंद॰ पुं० ఉత్తమమయేనుగు; ఐరావతము

करि॰ पुं० ఏనుగు; हाथी

करिखई॰ स्त्री० నలుపు; कालापन

करिखा॰ स्त्री० సిరా; కళంకము; పొగమసి

करिणी स्त्री० ఆడ ఏనుగు हथिनी

करिया॰ पुं० చుక్కాని; చుక్కాని పట్టువాడు; పడవనడుపువాడు; वि० నల్లని

करिल, पुं० చిగురుటాకు; वि० నల్లని

करिवदन· पुं० విఘ్నేశ్వరుడు; गणेश

करिशावक, पुं० గున్నయేనుగు

करिश्मा॰ पुं० వింతపని; అద్భుతకార్యము; కంటిసైగ

करी॰ पुं० ఏనుగు; स्त्री० మొగ్గ; చిన్నదూలము

क़रीन वि० సమానమైన; కలసియున్న; पुं० సభాసదుడు; మిత్రుడు

क़रीना· पुं० క్రమము; పద్ధతి; సామ్యము

क़रीब, क्रि० वि० సుమారు; దగ్గరగా; वि० సమీపమందున్న

क़रीब क़रीब, क्रि० वि० రమారమి; लगभग

क़रीब तरीन॰ वि० మిక్కిలిసమీపమందున్న

करीबन· क्रि० वि० రమారమి; लगभग

क़रीबुल्मौत· वि० మృతప్రాయుడగు; మరణాసన్నుడైన

करीम॰ पुं० భగవంతుడు; वि० దయగల

करीमी, स्त्री० దైవమాయ: దయ
करीर, पु० కుండ: వెదురు మొలక; ఆకులులేని ఒక ముండ్లచెట్టు (వెణుతురు చెట్టు)
क़रील, पु० ఆకులులేని ఒక ముండ్ల చెట్టు (వెణుతురుచెట్టు)
करुआ, वि० కటువైన: చేదుగానున్న: पु० పీకలేకముక్కుగల చెంబు
करुआई, स्त्री० చేదు; కటువు
करुआना, अ० क्रि० దుఃఖించుట: చేదుగానుండుట; स० क्रि० చేదువలన ముఖము ముడుచుకొనుట
करुण, वि० దయగల; జాలిపుట్టించునట్టి पु० దయ;ఒక కావ్యరసము; భగవంతుడు
करुणा, स्त्री० జాలి; దయ
करुवा, पु० పీకలేకముక్కుగలపాత్ర; वि० చేదుగల; అప్రియమైన; కటువైన
करेजा, पु० హృదయము: గుండె; కొమ్ము: సాహసము; ప్రియవ్యక్తి
करेर, करेरा } वि० కఠోరమైన; గట్టియైన
करेला पु० కాకరకాయ; काखेलल
करेली, स्त्री० అడవికాకర; చిన్నకాకర
करैत, पु० నల్లత్రాచుపాము
करैल, स्त्री० నల్లమట్టి: पु० మాలకాకి: వెదురు మొలక; తెముదుకాకి
करैला, पु० కాకర: करेला
करैली, स्त्री० అడవికాకర; చిన్నకాకర
करोट, पु० ఒత్తిగిలివరుండుట: करवट
करोटन, पु० క్రోటన్ మొక్క
करोटी, स्त्री० ఒత్తిగిలివరుండుట; తలపుర్రె
करोड़, वि० కోటి: पु० ఒకకోటిసంఖ్య
करोड़पति, पु० కోటీశ్వరుడు
करोड़ी, पु० సుంకమువసూలు చేయువాడు; షరాబు; కోశాధికారి
करोदना, स० क्रि० గీరుట: గోకుట
करोर, वि० కోటి; ఒక కోటి సంఖ్య
करौंछना, स० क्रि० గీరుట; గీకుట తురుముట
करौंछा, वि० కొంచెమునలుపుగల
करौंदा, पु० వాక్కాయ; కలివెయ నుముళ్ళ చెట్టు
करौट, स्त्री० ఒత్తిగిలివరుండుట
करौत, पु० రంపము: स्त्री० ఉంపుడుకత్తె
करौती, स्त्री० చిన్నరంపము; చిన్న గాజు పాత్ర
कर्क, पु० ఎండ్రకాయ; కర్కటరాశి; నిప్పు; కుండ; అద్దము; తెల్లగుఱ్ఱము; वि० తెల్లని; శ్రేష్ఠమైన
कर्कट, कर्कटक } पु० కర్కటరాశి; ఎండ్రకాయ; నూగుదోస
कर्कर, पु० కంకరరాయి; అద్దము; పదును పెట్టు రాయి वि० గరకుగానున్న: దృఢమైన; కఠోరమైన

ककंरी, स्त्री० పన్నినిమెడగలకొమ్ము పాత్ర; దోసమొక్క
कर्करोग, पुं० రాచపుండు; Cancer
कर्कश, पुं० చెఱకు; కత్తి; నిర్దయుడు; वि० కనికరములేని; కఠోరమైన; గరుకుగానున్న; ప్రచండమైన
कर्कशा, स्त्री० పోట్లాటగత్తె; కటుభాషిణి
क़र्ज़, पुं० అప్పు; उधार
क़र्ज़ख्वाह, पुं० ఋణదాత
क़र्ज़दार, वि० అప్పులు చేసినవాడు; ऋणी
क़र्ज़ा, पुं० అప్పు; क़र्ज़
कर्ण, पुं० చెవి; పడవచుక్కాని; కర్ణుడు
कर्णकटु, वि० వినుటకింపుగాలేని
कर्णजप, पुं० కొండెములు చెప్పుట वि० కొండెములు చెప్పువాడు

कर्णजलका } पुं० కాళ్ళజెఱ్ఱి
कर्णजलौका } कनखजूरा
कर्णधार, पुं० ఓడ నడుపు వాడు; సంచాలకుడు; वि० దు:ఖము ల నివారించువాడు
कर्णपूर, पुं० చెవికమ్మ: నల్లకలువ
कर्णपूरक, पुं० చెవికమ్మ; నల్లకలువ; కదంబము
कर्णफूल, पुं० చెవికమ్మ; కుండలము (లు)
कर्णमनोहर, वि० వినుటకింపుగానున్న
कर्णवेष्ट } पुं० కుండలము; పోగులు
कर्णवेष्टन }

कर्णिका, स्त्री० చేతి నడిమి వ్రేలు; చెవికమ్మ; తామరదుద్దు; కలము; తొండముచివర
कर्णी, पुं० కర్ణధారుడు; ఒక పర్వతము; గాడిద; स्त्री० బాణము; वि० చెవులు గల; పెద్దచెవులుగల
कर्णेजप, वि० पुं० కొండెములు చెప్పువాడు; రహస్యము చెప్పువాడు

कर्तन } पुं० కత్తిరింపు; కోయట;
कर्त्तन } రాట్నము వడకుట

कर्तनी, } स्त्री० కత్తెర; क़ैंची
कर्त्तनी, }
कर्त्तरिका, स्त्री० కత్తెర; కత్తి; బాకు
कर्तरी, } स्त्री० కత్తెర; కత్తి; బాకు;
कर्त्तरी, } ప్రావణము; అభినయ హస్తవిశేషము

कर्तव्य } पुं० విద్యుక్తధర్మము; वि०
कर्त्तव्य, } చేయదగిన; ఆవశ్యకమైన

कर्ता } पुं० బ్రహ్మ; భగవంతుడు;
कर्त्ता } అధికారి; గ్రంథకర్త; ప్రభువు; కర్త; वि० రచించు లేక తయారుచేయువాడు; చేయువాడు;

कर्तार, } पुं० భగవంతుడు;
कर्त्तार, } చేయువాడు; సృష్టికర్త

कर्तृक, } वि० చేయబడిన; पुं०
कर्त्तृक, } పనివారల సమూహము

कर्तृत्व, } पुं० చేయు నధికారము;
कर्त्तृत्व, } కార్యము
कर्द, पुं० బురద: అడుసు

कर्दम, पुं० బురద; మాంసము; పాపము; అడుసు

क़र्ना, पुं० ప్రాచీనకాలపు కొమ్ముృవాద్య విశేషము

कर्पट, पुं० చింపిగుడ్డ; चिथड़ा

कर्पटी, पुं० చింపి గుడ్డలు ధరించిన భిక్షగాడు

कर्पर, पुं० తలపుఱ్ఱె; భిక్షాపాత్ర; పెనము; తాబేలుపుఱ్ఱె; పెద్దకాగు; ఒకశస్త్ర విశేషము

कर्बुर, पुं० బంగారము; ఉమ్మెత్త; చిత్ర వర్ణము; రాక్షసుడు; నీరు; పాపము; वि० పలువన్నెలుగల

कर्म, पुं० పని; చర్య; వృత్తి; ప్రారబ్ధము; కర్మఫలము; విధాయక కృత్యము; మత విషయికమైన కార్యాచరణము; ద్వితీయావిభక్తి

कर्मकांड, पुं० మతసం॥ కృత్యములు, నిత్యనైమిత్తికాదుల విధానమును తెలుపు వేదభాగము

कर्मकांडी, पुं० పురోహితుడు; पुरोहित

कर्मकार, पुं० సేవకుడు; శిల్పి; కమ్మరి; కంసాలి [నౌకరు

कर्मचारी, पुं० కార్యకర్త; గుమాస్తా;

कर्मठ, वि० పనియందు నేర్పరియైన; కర్మనిష్ఠుడు; చురుకుగాపనిచేయునట్టి; पुं० కర్మకాండజరిపించువాడు

कर्मणा, क्रि० वि० కర్మననుసరించి; కర్మవలన.

कर्मण्य, वि० పనియందు చురుకులేక నేర్పుగల; పరిశ్రమించునట్టి; पुं० కార్యనిష్ఠ; సక్రియత్వము (చురుకుదనము)

कर्मण्यता, स्त्री० సామర్థ్యము; చతురత

कर्मधारय, पुं० మొదటిపదము విశేషము గాగల సమాసము

कर्मनिष्ठ, वि० బాగుగాపనిచేయునట్టి; పనియందుదీక్షగల

कर्मभूमि, स्त्री० ఆర్యావర్తము; యజ్ఞాది కార్యములకుతగినభూమి.

कर्मभोग, पुं० ప్రారబ్ధఫలము

कर्मयुग, पुं० కలియుగము

कर्मवाच्य, पुं० కర్మణిప్రయోగము

कर्मवाद, पुं० కర్మఫలమును అనుభవించక తప్పదనెడి (ప్రారబ్ధ) వాదము

कर्मवादी, पुं० కర్మఫలమును అనుభవించక తప్పదనివాదించెడువాడు

कर्मविपाक, पुं० పూర్వజన్మ కర్మఫలము

कर्मशाला, स्त्री० కార్ఖానా; कारखाना

कर्मशील, वि० పనిచేయుస్వభావముగల; ఉత్సాహవంతుడైన;

कर्मशूर, वि० కార్యశూరుడైన; పనియందుపట్టుదల ధైర్యముగల

कर्मसाक्षी, पुं० సూర్యచంద్రాదిదేవతలు; ప్రత్యక్ష సాక్ష్యము [अभागा

कर्महीन, वि० దురదృష్ట వంతుడు;

कर्मिष्ठ, वि० పనిలోతెలివిగలవాడు; కర్మనిష్ఠుడు

कर्रा. पुं० నేతకుమునుపు (నూలు) పదు గుచాచుట; वि० గట్టిగానున్న: కఠిన మైన

कर्राना. अ० क्रि० గట్టిగానుండుట

कर्ष. पुं० ఒకప్రాచీన నాణెము; బిగువు; లాగుట; దున్నుట; వ్యవసాయము; రాపిడి: ఉద్రేకము; ఇరువదిచిన్న ములయెత్తు;

कर्षक, पुं० రైతు; वि० లాగెడివాడు

कर्षण. पुं० ఈడ్చుట; దున్నుట; రాచుట; సాగుబడి

कर्षना, स० क्रि० ఈడ్చుట; సాగలాగుట; రాచుట: ఒరపిడిపెట్టుట

कर्षित वि० ఈడువబడిన; దున్నబడిన; క్షీణించిన; పీడింపబడిన; రాపిడికలుగ జేయబడిన

कलंक, पुं० దోషము; కళంకము; చంద్రునిమచ్చ; నల్లనిమచ్చ; ఇనుప చిట్టెము.

कलंकित. वि० మచ్చగల; కళంకము గల; అపకీర్తి గల;

कलंकी. वि० దోషియైన: అపకీర్తి గల; కళంకముగల; पुं० కలాక్యావతారము; చంద్రుడు

कलंगी. पुं० శిరోభూషణము; తురాయి; పెద్దభవనములశిఖరము; నెమలిశిఖ రము; కోడిజుట్టు; పక్షి ఈక

कलंदर, पुं० ఒకవర్ణ సంకరజాతిలేక ఆ జాతివ్యక్తి

क़लंदर, पुं० ఒకముసల్మాను పకీరు; ఎలుగుబంటు; కోతులనాడించువాడు; మహమ్మదీయ సాధువులసముదా యము

कल. पुं० అవ్యక్త మధురధ్వని; వీర్యము; स्त्री० యంత్రము; యంత్రభాగము; సుఖము; ఆరోగ్యము; విశ్రాంతి; పార్శ్వము; యుక్తి; అంగము; वि० అందమైన; అవ్యక్త మధురమైన; కోమలమైన; నల్లని; क्रि० वि० నిన్న; రేపు

क़लई, स्त्री० తగరము; పైమెరుగు; కళాయిపోయుట; సున్నము; సున్నము కొట్టుట

क़लईगर, वि० కళాయివేయువాడు: సున్నముకొట్టువాడు; పై మెరుగు పెట్టువాడు;

कलकंठ, पुं० కోకిల; హంస; పావురము; वि० మధురధ్వని చేయునట్టి;

क़लक, पुं० వ్యాకులత; చింత; దుఃఖము

कलकना. अ० क्रि० బిగ్గరగాఅరచుట; గోలచేయుట;

कलकल. पुं० నదిలేకసెలయేటిగలగల ధ్వని; కోలాహలము; स्त्री० వాదవివా దము; పోట్లాట

कलकान, } स्त्री० వ్యాకులత: దుఃఖము
कलकानि, } కలహము

कलग़ी. स्त्री० दे० कलंगी

कलशा, पुं० పెద్దగంటె: పెద్దగరిటె

कलछी॰ स्त्री॰ గంటె; పొడవైనపిడి గలగరిటె

कलछुला, पुं॰ పెద్దగరిటె;

कलत्र, पुं॰ భార్య; కోట; పిరుదు

कलदार, वि॰ యంత్రభాగములుగల; पुं॰ రూపాయినాణెము

कलधूत॰ पुं॰ వెండి; चाँदी

कलधौत॰ पुं॰ వెండి; బంగారము; అవ్యక్త మధురధ్వని वि॰ బంగారు వెన్నె గల

कलध्वनि॰ स्त्री॰ అవ్యక్తమధురధ్వని; पुं॰ కోకిల, నెమలి

कलन्दर॰ पुं॰ दे॰ कलंदर

कलप॰ पुं॰ గుడ్డలగంజి; కల్పము; వెంట్రుకలకుపూయునలుపురంగు;

कलपना, अ॰ क्रि॰ విలపించుట; स॰ क्रि॰ కోయుట; కల్పించుట; स्त्री॰ కల్పన; నిట్టూర్పు

कलफ़॰ पुं॰ గుడ్డలగంజి; మొటిమలేక నల్లనిమచ్చ

कलबल, पुं॰ ఉపాయము; గంద్రగోళము; वि॰ అస్పష్టమైన

कलबूत पुं॰ మూస; మాదిగవానిదిమ్మ; టోపీలు మొ॥ నవికుట్టుటకు పయోగించుచక్రము; ఆర్చీనిర్మాణము నకుపయోగించు చట్రపుపని

कलम, स्त्री॰ కలము; लेखनी

क़लम, स्त्री॰ చిత్రకారునికుంచె; చెట్టు యొక్క అంటు; కలముకోయుట

क़लमकश॰ वि॰ వ్రాతగాడు; కోయువాడు; నాశముచేయువాడు

क़लमकार, पुं॰ లేఖకుడు; చిత్రకారుడు; అద్దకపుపనివాడు

क़लमकारी॰ स्त्री॰ పూలతాదుల అల్లిక; చిత్తరువు చెక్కుట

कलमख॰ पुं॰ పాపము; మురికి

क़लमतराश॰ पुं॰ కలముచెక్కెడిచాకు

क़लमदस्त॰ वि॰ చిత్రకారుడు; వ్రాతగాడు

क़लमदान, पुं॰ కలము, సిరా బుడ్డి పెట్టుకొను ఇత్తడిలేకకొయ్య స్టాండు Ink Stand

कलमना॰ स॰ क्रि॰ తుంచుట; (కొమ్మలు) నరుకుట; (కాయల) చెక్కుతీయుట

क़मलबन्द, वि॰ వ్రాయబడిన; లిపిబద్ధమైన; पुं॰ చిత్రకారునికుంచెలు తయారుచేయువాడు

कलमलना॰ } अ॰ क्रि॰ తోట్రుపాటు
कलमलाना } పడుట; కలతజెందుట త్రొక్కిసలాడుట; पुं॰ గిజగిజలాడుట; తొక్కుడి

कलमा॰ पुं॰ వాక్యము; ఇస్లాంమూల మంత్రము; (లాఇలాహ ఇల్లిల్లాహ్, ముహమ్మద్ రసూలిల్లాహ్); సార్థక శబ్దము; కథనము

क़लमी, वि॰ వ్రాయబడిన, హస్తలిఖిత మైన; అంటువేయుటచే యుత్పన్నమైన

कलमुहाँ॰ वि॰ నల్లనిముఖముగల; కళంకితుడైన; దౌర్భాగ్యుడు; (తిట్టు)

कलरव॰ } पुं॰ మధురధ్వని; కోకిల
कलरौ॰ }

कलल॰ पुं॰ గర్భపిండము; గర్భాశయము

कलवार॰ पुं॰ శెట్టి బలిజ; ఈడిగజాతి; గమండ్లవాడు; కల్లుఅమ్మువాడు

कलश॰ पुं॰ కుండ; గోపురముమీది శిఖరము

कलशी॰ स्त्री॰ చిన్నకుండ; మజ్జిగకుండ; గోపురముమీది చిన్న శిఖరము; ఒకవాద్య విశేషము

कलस॰ पुं॰ दे॰ कलश

कलसा॰ पुं॰ కుండ; శిఖరము

कलसी॰ स्त्री॰ दे॰ कलशी

कलहंस॰ पुं॰ రాజహంస; పరమాత్మ; రాజశ్రేష్ఠుడు

कलह॰ पुं॰ యుద్ధము; పోట్లాట

कलहकार, वि॰ పోట్లాడు స్వభావముగల

कलहकारी॰ वि॰ కలహించునట్టి; కలహప్రియుడు

कलहप्रिय, वि॰ పోట్లాడు స్వభావము గల; पुं॰ నారదుడు

कलहप्रिया, वि॰ स्त्री॰ తగవులమారిస్త్రీ स्त्री॰ సారికయనుపక్షి

कलहांतरिता॰ स्त्री॰ ముందుకోపముచేత ప్రియునిఅవమానపరచి లేకవిడిచి పెట్టి పిమ్మటవిచారపడెడు నాయిక

कलहार, वि॰ కలహించునట్టి; జగడగొండి

कलहारी॰ वि॰ स्त्री॰ గయ్యాళియైన

कलही॰ वि॰ పోట్లాడుస్వభావముగల; జగడగొండి

कला, स्त्री॰ చంద్రునిలోనిపదునారవ భాగము; సూర్యునిలోని పండ్రెండవ భాగము; శిల్పము; విద్య; స్త్రీరజస్సు; జ్యోతి; వడ్డీ; రీతి, నౌక; లీల; కపటము; శోభ; లలితకళలు; అద్భుతశక్తి; పరిహాసము ब्याज నాట్యముచేయువాడు; ब्याजी పట్టీ గొట్టుట

कलाई॰ स्त्री॰ మణికట్టు; నూలువిచ్చు;

कलाकंद॰ पुं॰ ఒకరకమైన బరఫీ

कलाकर॰ पुं॰ చంద్రుడు; चंद्रमा

कलाकार, पुं॰ శిల్పి; నటుడు; పనివాడు; కళాకారుడు

कलाकुल, पुं॰ హాలాహలమనెడివిషము

कलाकुशल॰ वि॰ ఏకళయందైనా నైపుణ్యముగల

कलाकौशल, पुं॰ శిల్పము; పనితనము; నైపుణ్యము

कलादा, पुं॰ ఏనుగు మెడపైమాటీసు కూర్చుండుచోటు

कलाधर, पुं॰ చంద్రుడు; శివుడు; కళావిదుడు

कलाप॰ पुं॰ సమూహము; అమ్ములపొది; వృత్తి; గడ్డిమూట; నెమలిపించము;

బాణము; 25 పేటలుగల స్త్రీలయొ డ్డాణము; ఆభూషణము
कलापक॰ पुं॰ నెమలి; సమూహము; ఒడ్డాణము; గడ్డిమూట; ముత్యాల సరము; ఏనుగుమెడసంకెల
कलापी॰ पुं॰ నెమలి; కోకిల; అంబుల పొది ధరించినవాడు;
कलाबत्तून पुं॰ జరతారు; జరీ
कलाबत्तूनी, वि॰ జరీతోచేసిన
कलाबत्तून॰ पुं॰ జరతారు; జరీ
कलाबा, पुं॰ నూలుకండె; నూలువిచ్చు; ఏనుగుమెడత్రాడు; ఏనుగుమెడ
कलाबाज़ स्त्री॰ నటుడు; గారడీవాడు
कलाबाज़ी, स्त्री॰ గారడీవిద్య; తలక్రిందనుంచి కాళ్లపైకెత్తి మొగ్గవేయుట
कलाम, पुं॰ సంభాషణ; రచన; వాక్కు; వాగ్దానము; ఆక్షేపణ
कलामत, पुं॰ సంగీతజ్ఞుడు; పాటగాడు
कलामेमुल्लाह॰ पुं॰ దైవవాక్కు; ఖురాను;
कलार॰ } पुं॰ కల్లునమ్మెజాతి; ఈడిగ
कलाल॰ } వాడు
कलावत, पुं॰ నటుడు; గాయకుడు; కళాకారుడు; గారడివాడు; తాటిపై నృత్యముచేయువాడు वि॰ కళా ప్రవీణుడైన
कलावती, वि॰ स्त्री॰ కళలను తెలిసి నస్త్రీ; సుందరి; నేర్పుగల
कलावा, पुं॰ నూలుకండె; ఏనుగుమెడ;

कलावान॰ वि॰ నేర్పుగల; సామర్థ్యముగల
कलिंद॰ पुं॰ సూర్యుడు; యమునా నది పుట్టుకస్థానమైన యొకపర్వతము
कलिंदी, स्त्री॰ యమునానది; సగర చక్రవర్తి తల్లి
कलि, पुं॰ పాపము; కలహము; యుద్ధము; పాపబుద్ధి; కలియుగము (4 లక్షల 32 వేలుసంవత్సరములు) దుఃఖము; బాణము; వీరపురుషుడు; स्त्री॰ మొగ్గ; वि॰ నల్లని
कलिका॰ स्त्री॰ మొగ్గ; ఒకవాద్య విశేషము
कलिकान॰ वि॰ కలత జెందిన; हैरान
कलित॰ वि॰ మనోహరమైన; తెలియబడిన; ధ్వనించిన; పొందబడిన; అలంకృతమైన; తీసికొన్న
कलिमल, पुं॰ పాపము; पाप
क़लिया॰ पुं॰ వండినమాంసపుకూర
कलियाना, अ॰ क्रि॰ మొగ్గలతో నిండి యుండుట; పక్షులకు క్రొత్తగా యీకలు వచ్చుట
कलियुगी॰ वि॰ కలికాలపు
कलिल, वि॰ పరిపూర్ణమైన; అభేద్యమైన; ఆవృతము; చొరరాని; पुं॰ పెద్దరాశిలేకకుప్ప
कलींद॰ } पुं॰ పుచ్చకాయ; A Water
कलींदा॰ } Melon.
कली, स्त्री॰ మొగ్గ; కన్య; సున్నపురాయి

कलीट॰ वि॰ కారునలుపుగల
कलीम॰ वि॰ వక్త
क़लीस॰ वि॰ లోభియైన; कंजूस
कलीसा॰ पुं॰ క్రైస్తవుల చర్చి; गिरजा
कलीसाई, वि॰ క్రైస్తవుల చర్చి సం॥ पुं॰ క్రైస్తవుడు
कलीसिया॰ पुं॰ ఒక క్రైస్తవ సంఘము
कलुख॰ } पुं॰ మాలిన్యము; కోపము; पాపము; దున్నపోతు; वि॰ క్రూరమైన; మలినమైన; పాపియైన
कलुष॰
कलुषाई॰ स्त्री॰ అపవిత్రత; దోషము
कलुषित, वि॰ పాపముగల; మురికిగానున్న; అపవిత్రమైన; దుఃఖము నొందిన; దుష్టమైన; కోపముగల
कलुषी, वि॰ दे॰ कलुषित
कलूटा॰ वि॰ మిక్కిలి నల్లని; కురూపియైన
कलूला॰ पुं॰ పుక్కిలింత; कुल्ली
कलेऊ॰ पुं॰ అల్పాహారము; చద్దియన్నము ఒక వివాహపద్ధతి
कलेजा॰ पुं॰ సాహసము; గుండె; హృదయము; कटना, గుండెపగులుట काढ़ना గుండె పగులుదుఃఖముకలుగజేయుట; टूटना నిరుత్సాహపడుట निकाल कर रखना ప్రాణప్రియమైన వస్తువు నిచ్చుట सेलगाना కౌగిలించుకొనుట
कलेजी, स्त्री॰ గుండెమాంసము
कलेवर॰ पुं॰ శరీరాకృతి; దేహము
कलेवा, पुं॰ दे॰ कलेऊ
कलेस॰ पुं॰ దుఃఖము; చింత; కష్టము
कलैया॰ स्त्री॰ పల్టీ; తలక్రిందుగా మొగ్గవేయుట; జాలవిద్య
कलोल, पुं॰ వినోదము; కేళి; ఆనందోల్లాసములు; క్రీడ
कलोलना॰ अ॰ क्रि॰ ఆడుకొనుట; ఆనందముతో గంతులు వేయుట;
कलौंछ॰ स्त्री॰ పొగమసి; నలుపు
कलौंजी, स्त्री॰ తాలింపు; ఇగురుకూర
कल्क, पुं॰ కషాయము; మడ్డి; పాపము; మలము; పొడి; లేహ్యము; కపటము; గర్వము; రుబ్బిన పిండి वि॰ దుష్టమైన; పాపియైన
कल्प, पुं॰ న్యాయము; ప్రళయము; వ్రతకల్పము; చికిత్స; ఒక వేదాంగము; 4320000000 సంవత్సరములుగల బ్రహ్మదినము; విధానము; वि॰ సమానమైన
कल्पक॰ पुं॰ మంగలి; కల్పనచేయువాడు; రచించువాడు
कल्पन, पुं॰ మోసము; రచన; అలంకరించుట; కల్పన చేయుట
कल्पना॰ स्त्री॰ రచించుట; అలంకరించుట; ఊహ; శక్తి; కావ్యమునందు గలకల్పనా శక్తి.
कल्पनी॰ स्त्री॰ కత్తెర; कतरनी
कल्पनीय॰ वि॰ కల్పింపదగిన; ఊహింపదగిన

कल्पलता, स्त्री० కల్పవృక్షము; కల్పవృక్షపుశాఖ

कल्पवृक्ष, पु० కోరినవస్తువుల నిచ్చెడి దేవవృక్షము

कल्पांत, पु० ప్రళయము; ప్రలయ యుగాంతము

कल्पित, वि० కల్పింపబడిన; ఫోర్జరీయైన; కృత్రిమమైన

कल्मष, पु० పాపము; మురికి; అపవిత్రత; वि० పాపి; మురికిగల; దుష్టమైన

कल्या, स्त्री० మద్యము; పవిత్రవాక్కు

कल्याण, पु० మేలు; శుభము; సుఖసౌభాగ్యములు; శుభకార్యము; ఒక రాగవిశేషము

कल्याणी, वि० स्त्री० సుందరి; శుభమైన; स्त्री० ఆవు

कल्लाँच, वि० దరిద్రుడు; పోకిరి; రౌడి

कल्ला, पु० మొలక; చిగురుటాకు; మెడ; దవడ; దీపపువత్తిమర

कल्लातोड़, वि० నోరుమూయించునట్టి; నిరుత్తరుని జేయునట్టి

कल्लादराज, वि० పోట్లాడుస్వభావము గల; వదరుబోతు

कल्लादराजी, स्त्री० పోట్లాడుస్వభావము; వదరుట

कल्लाना, अ० क्रि० దెబ్బవల్ల నొప్పిపుట్టుట; కాలినందునమంట పుట్టుట

कल्लोल, पु० పెద్దయల; ఆనందము; క్రీడ; वि० విరోధముగల

कल्लोलिनी, स्त्री० నది; नदी

कल्हरना, अ० क्रि० తాలింపువేయబడుట; వేయింపబడుట

कल्हारना, स० क्रि० వేయించుట; తాలింపువేయుట; अ० क्रि० బాధచే మూల్గుట

कवच, पु० తావిత్తు; కవచము; తప్పెట; నగారా; పైతోలు

कवड, पु० పుక్కిలింతనీళ్లు

कवर, पु० నోటిముద్ద; కబళము; జడ; అశ్వజాతివిశేషము

कबरना, स० क्रि० వేడిచేయుట; కొంచెము కొంచెముగావేయించుట

कवरी, स्त्री० జడ, కొప్పు

कवल, पु० కబళము, పుక్కిలింత; నోటిముద్ద; అశ్వజాతి విశేషము; ఒక పక్షి

कवलन पु० తినుట; నమలుట; మ్రింగుట

कवलित, वि० తినడిన; నమలబడిన; మ్రింగబడిన

कवाट, पु० తలుపు, किवाड

क़वायद, पु० నియమావళి; నిబంధన; వ్యాకరణ సూత్రములు; स्त्री० వ్యాకరణము; పోలీసులకవాతు

क़वायदगाह, स्त्री० కవాతు మైదానము; సైనికులకవాతు

कविज्येष्ठ, पु० ఆదికవివాల్మీకి

क़साईख़ाना, पुं० కసాయిదుకాణము; మాంసమమ్ముస్థలము

कसाकसी• स्त्री० బిగింపు; బద్ధవైరము

कसाना, स० क्रि० బిగించుట; బిగింపజేయుట అ० क्रि० చిలుమెక్కుట; ఒగరుగానుండుట

कसालत• स्त्री० సోమరితనము; सुस्ती

कसाला• पुं० కష్టము; కఠిన పరిశ్రమ Scarcity తగినంతగా లభింపక పోవుట [తీక్ష్ణత

कसाव• पुं० బిగింపు; కటికవాడు; ఒగరు;

कसावट• स्त्री० బిగింపు; तनाव

कसावड़ा• पुं० కటికవాడు; कसाई

कसीटना• स० क्रि० బిగించుట; అద్దగించుట

कसीदा• पुं० వస్త్రములపైపూలతాదు లయల్లిక

क़सीदा, पुं० ఉర్దూలేక పారసీలోని ఒకఛందస్సు; ముఖస్తుతి

क़सीदाख्वां• वि० భట్రాజు; ముఖస్తుతి చేయువాడు

क़सीदागो• वि० "కసీదా" ఛందరచన చేయువాడు

कसीर• वि० అత్యధికము

कसीस• स्त्री० నిర్దయత; ప్రయత్నము

कसूंभा• } वि० బంగారువన్నెగల;
कसूंभी• } బంగారువీరద్దిన-

कसूमर, पुं० పుష్పము; కుసుంభవర్ణము; శ్రీరచిప్పు; నేత్ర రోగము

कसूर, पुं० అపరాధము; పొరపాటు; దోషము;

क़सूरमंद• } वि० అపరాధియైన;
क़सूरवार, } దోషియైన

कसेरा• पुं० కంచరవాడు; కళాయి పూయువాడు

कसेरू• पुं० తుంగవేరు

कसैला- वि० ఒగరుగానున్న; తీక్ష్ణమైన

कसैली• स्त्री० వక్క; सुपारी

कसोरा• पुं० చిన్న గిన్నె; మట్టి చిప్ప

कसौटी, स्त्री० గీటురాయి; వన్నెపరీక్ష; నిదర్శనము

कस्तरी, स्त्री० పాలుకాయు మట్టిపాత్ర

कस्तूर, पुं० కస్తూరి మృగము; కస్తూరి లాంటి మృగమదము

कस्तूरा, पुं० కస్తూరిమృగము; ఒక నక్క; ముత్యపుచిప్ప

कस्तूरिया, वि० కస్తూరి కలిపిన; కస్తూరి రంగువంటి; पुं० కస్తూరి మృగము కస్తూరి అమ్మువాడు

कस्तूरी• स्त्री० కస్తూరి; Musk

क़स्बा, पुं० చిన్నపట్టణము; పెద్ద గ్రామము

क़स्बाती, वि० నగరవాసి; शहराती

कस्बी• वि० వేశ్య; गणिका

कस्बे हुनर• पुं० శిల్పకళనేర్చుకొనుట; ఏకళనైనా నేర్చుకొనుట

कसरत, स्त्री० వ్యాయామము; అధిక్యము

क़स्साब, पुं० కసాయివాడు; क़साई

क़स्साबख़ाना, पुं० కసాయిదుకాణము; మాంసపుకొట్టు

कहँ. क्रि० वि० ఎక్కడ; प्र० కొరకు

कहँरना. अ० क्रि० బాధతో మూల్గుట; कराहना.

क़हक़हा. पुं० పకపకలు; అట్టహాసపు నవ్వు

कहगिल, पुं. పొట్టుకలిపిన మట్టి అడుసు

कहता. वि० చెప్పువాడు; మాట్లాడువాడు

कहतूती. स्त्री० సామెత; కథ; లోకోక్తి

कहन. स्त्री० కథనము; మాట; సామెత

कहना. पुं० కథనము; स० क्रि० చెప్పుట; సూచించుట; మాటలాడుట

क़हनी. स्त्री० కథనము: కథ

कहनूत स्त्री० సామెత; कहावत

क़हर. पुं० ఆపద; అత్యాచారము; वि० అపారము; భయంకరము

कहरना. अर क्रि० బాధచే మూల్గుట; कराहना

कहलवाना. }
कहलाना. } स० क्रि० చెప్పించుట; ఉచ్చరింప జేయుట; अ० क्रि० పిలువబడుట

कहवा. पुं० కాఫీవిత్తనము: కాఫీ

कहवैया. पुं० చెప్పువాడు

कहाँ. क्रि० वि० ఎక్కడ; पुं० ప్రసవించిన వెంటనే ఏడ్చెడి పసిబిడ్డ ఏడుపుధ్వని

कहा. स्त्री० కథ; पुं० ఆదేశము; కథనము; సలహా; सर्व० ఏది; ఎవరు; वि० ఏమిటి; क्रि० वि० ఎప్పుడు; ఎట్లు

कहाकही, स्त्री० వివాదము; ఘర్షణ

कहाना. स० क्रि० చెప్పించుట; ఉచ్చరింప జేయుట; अ० क्रि० అనిపించుకొనుట (పిలువబడుట)

कहानी, स्त्री० కథ; కల్పితకథ; పుక్కిటిపురాణము

कहार. पुं० దోలీమోసెడి, లేక నీళ్ళు తెచ్చెడి ఒక శూద్రజాతి

कहारा. पुं० బుట్ట: टोकरा

कहावत. स्त्री० సామెత; కథనము లోకోక్తి; చావుకబురు

कहासुना. पुं० తగనిమాట; పొరపాటు

कहासुनी. स्त्री० వాదవివాదము; తగాదా

कही. क्रि० वि० మరొకచోట; బహుశా; ఎచ్చటనైనా; वि० మిక్కిలి యధికము; का कहीं. ఒకచోటనుండి వేరొకచోటుకు; कहींका ఎక్కడిదో; గొప్ప

कहींकहीं, क्रि० वि० అచ్చటచ్చట; కొన్నిచోట్ల

कही, स्त्री० చెప్పినమాట; కథనము

कहूँ. }
कहूँ, } क्रि० वि० ఎక్కడనైనా; బహుశా; మరొకచోట

कहुला वि० నల్లని; काला

काँइयाँ, वि० జిత్తులమారి; ధూర్తుడు

काँकर. पुं० కంకర; రాతిముక్క

काँकरी स्त्री० గులకరాయి; చిన్నరాతి ముక్క

कांक्षा, स्त्री० కోరిక; ప్రవృత్తి
कांक्षित, वि० కోరబడిన
कांक्षी, वि० కోరుచున్నవాడు
काँख स्त्री० చంక; बगल
काँखना, अ० क्रि० బాధతోమూల్గుట
काँगड़ी, स्त्री० కాశ్మీర్‌వాసులు మెడలో ప్రేలాడ వేసుకొను చిన్నకుంపటి (చలిప్రదేశములందు ఇది జరుగును)
काँगनी, स्त्री० చిన్నకంకణము; కొర్రలు
काँगरू, पु० दे० कंगारू
काँगही, स्त्री० చిన్నదువ్వెన; సాలెవాని అచ్చుకట్టుపన్నె
काँगूरा, पु० బురుజు; శిఖరము
काँच, पु० గాజు; स्त्री० గోచి; కాసె
कांचन, पु० బంగారము; ఉమ్మెత్త; సంపెంగ
कांचनार, पु० కోవిదారవృక్షము; कचनार
काँचरी, काँचली, स्त्री० పాముకుబుసము; केंचुली
काँचा, वि० పచ్చిగానున్న; అస్థిరమైన
कांचि, कांची, स्त्री० ఒడ్డాణము; మొల నూలు; కంచీపురము
काँचुरी, काँचुली, स्त्री० పాముకుబుసము. केंचुली
काँछ, पु० కాసె; గోచి; మొల
काँछना, स० क्रि० గోచిపెట్టుట; ధరించుట; సరిచేయుట; అలంకరించుట
काँछा, स्त्री० కోరిక, कांक्षा

कांजिक, पु० పులియబెట్టిన కడుగునీరు; त्रि० పుల్లని
कांजी, काँजी, स्त्री० పులియబెట్టిన కడుగు నీరు; మజ్జిగతేట
काँजी-हाउस, काँजीहौद, पु० బందెలదొడ్డి
काँट, काँटा, पु० ముల్లు; చీల; ఇనుపకొక్కెము, తరాజుముల్లు; గడియారపుముల్లు; మొనతేలినవస్తువు; అన్నముతినుట కుపయోగించు పంగలగరిటె (Fork); చేపలుపట్టు గాలము
काँटी, स्त्री० చిన్నముల్లు; చిన్నచీల
काँठा, पु० ఒడ్డు, పార్శ్వము; మెడ; చిలుకమెడపైని గుండ్రనిగీత
कांड, पु० సమూహము; బాణము; కాడ; చెట్టుబోదె; గుత్తి; గ్రంథములోని పరిచ్ఛేదము; ఏకాంతము; దుద్దుకర్ర
काँड़ना, स० क्रि० నలుపుట; దంచుట; చావతన్నుట
काँडली, स्त्री० బచ్చలికూర; कुलफा
काँड़ी, स्त्री० కందికంప; ఇంటివాసము, పశువుల మందుగొట్టము; రోటిగుంట; నాగటికాడి
कांत, पु० పతి; ప్రియుడు; చంద్రుడు; శివుడు; ఇనుము; వసంతఋతువు; విష్ణువు; वि० చక్కని; ప్రియమైన
कांता, स्त्री० భార్య; ప్రియురాలు; సుందరి

कांति॰ स्त्री० శోభ; కాంతి; కోరిక; సౌందర్యము

कांतिदायक, वि० శోభించునట్టి

कांतिमान॰ वि० కాంతిగల; సుందరమైన

काँदना, अ० क्रि० విలపించుట; रोना

काँदा, पु० పెద్దఉల్లిపాయ; प्याज

काँदिशीक, वि० భయపడిన; భయపడి పారిపోయిన

कांदो॰ पु० బురద; कीचड

काँध. पु० భుజము; कंधा

काँधना॰ अ० क्रि० నిర్వహించుట; పై కెత్తుట; బాధ్యత వహించుట; నిశ్చయించుట

काँधा, पु० శ్రీకృష్ణుడు; భుజము

काँधी. स्त्री० భుజము; कांधा

काँप, स्त्री० కర్ణాభరణము; సన్నని వెదురుబద్ద లేక చువ్వ; పంది లేక ఏనుగు దంతము

काँपना॰ अ० क्रि० కంపించుట; వణకుట

काँय-काँय॰ / काँव-काँव॰ } स्त्री० కాకి గోల; కాకి అరుపు; వ్యర్థప్రసంగము

काँवर॰ स्त्री० కావడి; కావడిబద్ద

काँवरा, वि० కలవరపడిన; గాభరాపడిన

कवरि, स्त्री० दे० काँवर

काँवरिया, पु० కావడి మోయువాడు

काँवाँरथी॰ पु० కావడి మోయుచు తీర్థయాత్ర చేయువాడు

काँस॰ पु० రెల్లు [కంచు

काँसा॰ पु० భిక్షాపాత్ర (తలపత్రె;

काँसागर पु० కంచరవాడు; Brazier

काँसार, पु० కంచర వాడు; కళాయి పూయువాడు

कांसीय, पु० తగరము; సీసము

कांस्य, पु० కంచు; పానపాత్ర; वि० కంచుతో చేయబడిన

कांस्यक, पु० ఇత్తడి; पीतल

काँस्यकार पु० కంచరవాడు; कसेरा

का-प्र० షష్ఠీ విభక్తి ప్రత్యయము; सर्व० ఏమి

काइयाँ॰ वि० ధూర్తుడు; జిత్తులమారి

काई॰ स्त्री० నాచు; తీగపాచి; చిలుము; త్రుప్పు; మురికి

काक॰ पु० కాకి; బిరడా; కుంటివాడు; నీచుడు

काकगोलक॰ पु० కాకికంటిపాప

काकतालीय॰ वि० కాకతాళీయ న్యాయము; రాలిపోనున్న తాడిపండు కాకి వ్రాలిపడినదని చెప్పుట

काकपद॰ पु० వ్రాతలో వదలివేయబడిన అక్షరములు పైన వ్రాయునపుడు అందుకు గుర్తుగా పెట్టెడు Λ (హంసపాదు) గుర్తు

काकफल पु० వేపకాయ

काकवंध्या. स्त्री० ఒకే ఒక సంతానము కల్గి మరల కాన్పులులేని స్త్రీ

काकबलि, स्त्री० శ్రాద్ధము లందు కాకికివేయు అన్నము [colour

काकरेज, पु० ధూమ్రవర్ణము; Purple

काकरेज़ा, पुं० ధూమ్రవర్ణపువస్త్రము: ధూమ్రవర్ణము

काकरेज़ी, पुं० ధూమ్రవర్ణము: वि० ధూమ్రవర్ణముగల

काकल, पुं० కాకి: మాలకాకి; గొంతు యందు పైకికనపడుబుడిపి

काकलि, स्त्री० మధురధ్వని

काकली, स्त्री० మధురధ్వని; గురిగింజ; కత్తెర; దొంగలుపయోగించు గడ్డపార

काकवंध्या, स्त्री० दे० काकबंध्या

काका, पुं० పినతండ్రి; పెత్తండ్రి

काकाकौआ, } पुं० నెత్తిపైసిగగల
काकातुआ, } పెద్దచిలుక; A cockatoo

काकी, स्त्री० పినతల్లి (పినతండ్రిభార్య); పెత్తల్లి; ఆడకాకి

काकु, पुं० వ్యంగ్యము: దెప్పిపొడుపు: తిరస్కారము; వక్రోక్తి; అలంకారపు ఒక భేదము

काकुल, स्त्री० జులపాలు; ఉంగరపువెంట్రుకలు

काकोल, पुं० మాలకాకి: పాము; పంది: విషభేదము; కుమ్మరి

काकोलूकिका, బద్ధవైరము

काग, पुं० కాకి; సీసాబెండు (బిరడా); మాలకాకి

काग़ज़, पुं० కాగితము; వ్రాతదాఖలా

काग़ज़ात, पुं० కాగితములు; పత్రములు [काग़ज़ का बहु०]

काग़जी, वि० కాగితముతో చేసిన; पुं० కాగితములమ్మువాడు

कागद, पुं० दे० काग़ज़

कागर, पुं० కాగితము; రెక్క; కుబుసము

कागरी, वि० తుచ్ఛమైన; तुच्छ

कागला, पुं० కొండనాలుక; घाँटी

कागा, पुं० కాకి; कौआ

कागारोल, पुं० కాకిగోల; గలభా; కాకుల అరుపు

कागौर, पुं० శ్రాద్ధములందు కాకికివేయు యన్నము

काच, पुं० గాజుపూస; అద్దము; చవుడు; ఒక కంటిజబ్బు

काचा, वि० పచ్చగానున్న; పక్వముకాని

काची, स्त्री० పాలకుండ; పెరుగుకుండ; ఒకహల్వావిశేషము

काचो, वि० పచ్చిగానున్న; పక్వముకాని

काछ, पुं० గోచి; మొల; కాసె

काछना, स० क्रि० గోచిపెట్టుట; ధరించుట; కూడబెట్టుట; ద్రవపదార్థముపై దేలు తెట్టనుతీయుట

काछनी, स्त्री० రెండు గోచీలుపెట్టి మోకాలువరకు ధరించిన దోవతి; విగ్రహములకు ధరించు పరికిణి

काछा, पुं० లంగోటీ; రెండు గోచీలు బిగించి కట్టిన దోవతి

काछी, स्त्री० కూరగాయలుపండించి అమ్మి జీవించు జాతి

काछू తాబేలు; कछुआ
काछे॰ क्रि॰ वि॰ దగ్గర, సమీపమున
काज,॰ पुं॰ పని; వృత్తి; ఉద్దేశ్యము; వివాహకార్యము; గుండీ బెజ్జము (కాజా)
काजर॰ पुं॰ दे॰ काजल
काजरी॰ स्त्री॰ కాటుక కన్ను గల యావు
काजल॰ पुं॰ దీపపుకొడి; కాటుక
क़ाज़ी, पुं॰ మహమ్మదీయులన్యాయాధికారి
काजू, पुं॰ జీడిపప్పులేక చెట్టు
काट॰ स्त्री॰ కత్తిరింపు; కోత; మోసము; కుస్తీలోని ఒక రహస్యము
काट-छाँट, स्त्री॰ కత్తిరింపు; శోధనము; పెంచుట తగ్గించుట
काटना॰ स॰ क्रि॰ కోయుట; నరుకుట; గిడుపుట; రద్దుచేయుట; దోమలు మొ॥ కుట్టుట; కరచుట; గాయపరిచుట; కత్తిరించుట; యుద్ధమున చంపుట
काटर॰ वि॰ కఠినము; గట్టిపట్టుదల గల; మూర్ఖనమ్మకముగల; మూర్ఖుడైన; గట్టి
काटू पुं॰ కోయువాడు; కోయు పరికరము; वि॰ భయంకరమైన; కఠినమైన
काठ, पुं॰ కొయ్య; వంట చెరకు; కొయ్యబొమ్మ; కొయ్యబేడీ
काठकबाड़॰ पुं॰ పనికిమాలిన కొయ్య వస్తువులు; చెత్తసామాను
काठड़ा॰ पुं॰ పెద్ద కొయ్యపాత్ర
काठी, स्त्री॰ కొయ్యజీర; గుఱ్ఱపుజీను; దేహసౌష్ఠవము
काड़ी॰ स्त्री॰ కందికంప; रहठा
काढ़ना॰ स॰ क्रि॰ బయటికితీయుట; సూదితో తీగలు మొ॥ అల్లుట; బహిర్గతముచేయుట; చిత్రించుట; చెక్కుట; అప్పుతీసుకొనుట
काढ़ा॰ पुं॰ కషాయము; क्वाथ
कातना॰ स॰ क्रि॰ వడుకుట
कातर, वि॰ పిరికియైన; భయపడిన; దుఃఖితుడగు
काता, पुं॰ నూలు; దారము; వంకరకత్తి
कातिक॰ पुं॰ కార్తీకమాసము
कातिब, पुं॰ దస్తావేజులు మొ॥ వ్రాయువాడు; వ్రాయసకాడు; గుమాస్తా
कातिल॰ पुं॰ హంతకుడు; वि॰ హత్య చేయునట్టి
काती, स्त्री॰ కత్తెర; పేనాకత్తి; చాకు; కత్తి
कांथ, पुं॰ కాచు; स्त्री॰ గంత; బొంత
कायरी॰ स्त्री॰ చింపిగుడ్డ; గంత; బొంత
कादंबिनी, स्त्री॰ మేఘపంక్తి; मेघ-माला
कादर॰ वि॰ పిరికియైన; దుఃఖితుడు; భయపడిన
क़ादिर, वि॰ బలవంతుడు, సమర్థుడు
कान॰ स्त्री॰ మర్యాద; లోకలజ్జ; సంకోచము; వంశప్రతిష్ఠ; पुं॰ చెవి-శ్రవణశక్తి

कानडा, वि० ఒంటికన్నుగల
कानदर्द, पु० చెవిపోటు
कानन, पु० అడవి; ఇల్లు; తోట
काना, पु० పాచికలమీదిగురుతు; वि० ఒంటికన్నువాడు; వంకరగానున్న; పిట్టలుకొట్టిన (కాయ)
कानाकानी, स्त्री० కర్ణపరంపర; చెవిలో గుసగుస చెప్పుట; జాతాజానీ; లోకాభి రామాయణము
कानागोसी, कानाफुसकी, कानाफूसी — स्त्री० గుసగుసలాడుట; చెవిలోచెప్పు రహస్యము
कानि, स्त्री० గౌరవము; వినయము; లోకలజ్జ; సంకోచము; సిగ్గు
कानी, वि० ఒంటి కన్నుగల (స్త్రీ): మిక్కిలిచిన్నదైన [ఛిగునీ
कानीउंगली, स्त्री० చిటికెనవ్రేలు;
कानीकौड़ी, स्त्री० గ్రుడ్డిగవ్వ; చిల్లిగవ్వ
कानीहाउस, पु० బందెలదొడ్డి; काँजी हाउस
क़ानून, पु० నియమము; చట్టము
क़ानूनगो, पु० గ్రామకరణాల లెక్కలు తనిఖీచేయు రెవిన్యూ యధికారి
क़ानूनदाँ, वि० చట్టము బాగుగా తెలిసిన వాడు
क़ानूनन, क्रि० वि० చట్టము ననుసరించి
क़ानूनशिकनी, स्त्री० నియమభంగము; మర్యాదగా తిరస్కరించుట [వాడు
क़ानूनिया, वि० లాయరు; వాదములాడు
क़ानूनी, वि० చట్టమెరిగిన; చట్టసంబంధమైన;
कान्ह, पु० శ్రీకృష్ణుడు; कन्हैया
कापथ, पु० చెడుమార్గము
कापाल, पु० కాపాలికుడు; ఒకప్రాచీన అస్త్రము; वि० కపాల సం॥
कापालिक, पु० మనుష్యుల పుఱ్ఱెలను దండగావేసుకుని తిరుగుచుండెడియొక శైవుడు वि० కపాల సం॥
कापाली, पु० శివుడు; स्त्री० పుఱ్ఱెల దండ; ధూర్తస్త్రీ
कापुरुष, पु० నీచవ్యక్తి; పిరికివాడు
कापोत, पु० కపోతముల సమూహము
काफ़िर, पु० నాస్తికుడు; ఆఫ్ఘనులలో ఒకజాతి; वि० దుర్మార్గుడు; నిర్దయుడు
काफ़िराना, वि० దుష్టులవలె; నాస్తికుల వలె
क़ाफ़िरी, स्त्री० నాస్తికత; ఆఫ్ఘనిస్తానపు కాఫిర్ లభాష वि० ప్రేమపాత్రుడు
क़ाफ़िला, पु० యాత్రికదళము; కలిసి కట్టుగా ప్రయాణముచేయు వర్తకుల సమూహము
काफ़ी, पु० ఒకరాగవిశేషము; स्त्री० కాఫీ; वि० చాలినంత; తగినంత; చాల
काफ़ूर, पु० కర్పూరము; कपूर
काफ़ूरी, वि० కర్పూరసంబంధమైన; కర్పూరముతో చేయబడిన

क़ाब, स्त्री० పెద్దపళ్లెము; పెద్దపాత్ర
काबक, पुं० పావురములు, కోళ్ళు మొ॥ వానిగూడు
काबर, वि० పలుపన్నెలుగల
क़ाबा, पुं० మక్కా పట్టణమందలియొక పవిత్ర స్థానము: నాల్గుకోణములుగల పెద్దభవనము, ఇబ్రహీం దీనికి పునాది వేసెనని ప్రతీతి
क़ाबिज़, वि० అధికారముగల; మలబద్ధకము కలుగజేయు (తినుబండారము); पुं० అధికారి
क़ाबिल, वि० యోగ్యుడు; పండితుడు
क़ाबिला, स्त्री० విద్యావంతురాలు: యోగ్యురాలు
क़ाबिलियत, } स्त्री० యోగ్యత; పాండిత్యము; తెలివి
क़ाबिलीयत, }
क़ाबिले तारीफ़, वि० ప్రశంసింపదగినది
क़ाबिले रहम, वि० దయజూపదగినది: దయనీయమైన
क़ाबिलेसजा, वि० దండింప దగిన; శిక్షార్హమైన
काबिस, पुं० మట్టిపాత్రలకు వేయురంగు
काबुक, पुं० दे० काबक
क़ाबू, पुं० అధికారము; ఒత్తిడి; వశము
काम, पुं० కోరిక; పని; మన్మథుడు; ఉపయోగము; సంబంధము; శిల్పము;
कामकाज, पुं० పనిపాటలు; काम-धंधा
कामकाजी, वि० పనిలోనున్న; కార్యశీలుడు
कामगार, पुं० వ్యవస్థాపకుడు; గుమాస్తా; కూలివాడు वि० సఫలమనోరథుడు; అదృష్టవంతుడు
कामचलाऊ, वि० తనపనిసాగించు నేర్పుగల; ఉపయోగకరమైన
कामचोर, वि० పనిదొంగ; సోమరి
कामज, वि० కామము లేక మోహము వలనపుట్టిన; కామము లేక మోహ సంబంధమైన
कामज्वर, पुं० అఖండ బ్రహ్మచర్యము వలన వచ్చు జ్వరము
कामत, स्त्री० అధికారము; దేహము; దీర్ఘకాయము
कामतरु, पुं० కల్ప వృక్షము
कामद, वि० కోర్కెల నెరవేర్చునది
कामदा, स्त्री० కామధేనువు; कामधेनु
कामदानी, स्त्री० జరీపని; పూలఅల్లిక పని
कामदार, पुं० ఉద్యోగి; మేనేజరు; వ్యవస్థాపకుడు वि० జరీపని చేయదగిన
कामदुहा, स्त्री० కామధేనువు; कामधेनु
कामधाम, पुं० పనిపాటలు; कामकाज
कामना, स्त्री० కోరిక, ख्वाहिश
कामबाण पुं० మన్మథుని పంచ బాణములు [మోహనము, ఉన్మాదము, సంతపనము, శోషణము, విశ్లేషీకరణము]
कामयाब, वि० కృతకృత్యుడైన; పరీక్షలో ఉత్తీర్ణుడైన; కోరికనెరవేరిన

कामयाबी, स्त्री० సఫలత; కార్యసిద్ధి

कामर, कामरि, } स्त्री० కంబళి; कंबल

कामरिपु॰ पु० శివుడు; शिव

कामरिया॰ कामरी॰ } स्त्री० చిన్న కంబళి; कमली

कामरूपी, वि० అందగాడు; తనకిష్టము వచ్చిన రూపమును పొందువాడు

कामल॰ पु० కామెర్లరోగము; వసంత ఋతువు; మరుభూమి; वि० విషయేచ్ఛ గల; కాముకుడు

कामला, पु० కామెర్లరోగము; पीलिया

कामली॰ स्त्री० చిన్నకంబళి; కామెర్ల రోగము; वि० కామెర్లరోగముగల

कामांध॰ वि० కామపుమత్తులో కన్ను మిన్ను తెలియనివాడు

कामाख्या॰ स्त्री० దుర్గ

कामातुर॰ वि० కామపూరితమైన; విర హార్తుడైన

कामित, वि० అభిలషించిన; కోరబడిన

कामिता॰ स्त्री० కాముకత్వము; వంశోగేచ్ఛ

कामिनी, स्त्री० అందగత్తె; కాముకి; సారాయము

कामिल, वि० యోగ్యము; పూర్ణము

कामी॰ वि० కాముకుడు; ప్రేమించెడు; కోరికగల; पु० చంద్రుడు; శివుడు; పావురము; లంపటుడు; ప్రేమించెడి వాడు

कामुक, पु० అనాచారపరుడు, పోకిరి; స్వేచ్ఛానువర్తి; वि० ఇంద్రియవాంఛ గల; కామాతురమైన; మోహాంధు డైన

काम्य, वि० కోరదగినది; మనోహర మైనది

काम्यदान, पु० గొప్పదానము; పుచ్చు కొనదగిన దానము; స్వేచ్ఛగాయివ్వ బడిన దానము

काम्या॰ स्त्री० కోరిక; इच्छा

काम्येष्ठि॰ स्त्री० కోరికతో చే- యజ్ఞము

काय, स्त्री० శరీరము; సమూహము; మూలధనము;

कायक॰ वि० శరీరసంబంధమైన

क़ायजा॰ पु० గుఱ్ఱపుకళ్లెపుత్రాడు

कायथ॰ पु० కరణము; కరణీకముచేయు (కాయస్థ) జాతి

क़ायदा, पु० నియమము; ఆచారము; క్రమము; పద్ధతి

कायनात, स्त्री० సృష్టి; ప్రపంచము

क़ायम वि० స్థిరమైన; నిర్ణయింపబడిన

क़ायममिज़ाज, वि० మనస్సు నిలకడగల

क़ायम मुक़ाम, वि० ఒకరికిబదులుగా పనిచేయునట్టి

कायर, वि० పిరికి; डरपोक

कायरता, పిరికితనము; भीरुता

क़ायल, वि० ఒప్పుకొనువాడు; చేసినతప్పుఒప్పుకొనువాడు

कायस्थ, पुं० జీవాత్మ; పరమాత్మ: కరణము; కరణీకముచేయు ఒక హిందూజాతి: वि० శరీరములోనున్న
कायस्थी, स्त्री० కాయస్థునిభార్య
काया, स्त्री० శరీరము: రూపము
कायाकल्प, पुं० ఔషధప్రభావమువలన వృద్ధాప్యమును పోగొట్టి యౌవ్వనమును ప్రసాదించు ఒకకార్యము: ప్రేమచంద్ రచించినయొకనవల
काय पलट, स्त्री० గొప్ప మార్పు: రూపముమారుట
कायिक, वि० శరీరసంబంధమైన
कारंड, कारंडव, } पुं० హంస లేక బాతుజాతికి చెందినయొకపక్షి
कार, पुं० పని: स्त्री० మోటర్‌కారు; वि० నల్లని
कार-आज़मूदा, वि० అనుభవశాలి
कार-आमद, वि० ఉపయోగకరమైన
कारक, पुं० విభక్తి: वि० చేయునట్టి
कारकरदा, అనుభవశాలి
कारकुन, वि० నిర్వాహకుడు; మేనేజరు; గుమాస్తా; ఏజెంట్
कारखाना, पुं० కర్మాగారము; ఫ్యాక్టరీ; కార్యాలయము
कारगर, वि० ఉపయోగకరమైన; గుణమిచ్చునట్టి; తన కర్తవ్యము నిర్వహించునట్టి
कारगुज़ार, वि० నేర్పుగాపనిచేయునట్టి; కర్తవ్యము నిర్వహించువాడు
कारगुज़ारी, स्त्री० కర్తవ్యనిర్వహణ: నైపుణ్యము
कारचोब, पुं० జరీపని చేయువాడు; అద్దకపుపని చేయువాడు; జరీపని చేయునపుడు గుడ్డలాగికట్టెడు కొయ్యచట్రము
कारचोबी, स्त्री० జరీపని; అద్దకపు పని
कारज, पुं० కార్యము; పరిణామము; కర్తవ్యము; వృత్తి: ధార్మికకృత్యము; దావా; వ్యాజ్యము; ఉద్దేశ్యము
कारणीभूत, वि० మూలకారణమైన
कारतूस, पुं० తోటా; गोली
कारन, पुं० కారణము स्त्री० ఆర్తనాదము
कारनामा, पुं० ప్రశంస నీయమైనపని: చేసిన పనుల వివరములేక పత్రిక
कारनिस, स्त्री० గోడలు మొ॥ వాని చివరనుండు శృంగారమైన అంచు; cornice
कारनी, वि० దుర్బోధచేయువాడు; రెచ్చగొట్టువాడు
कारपरदाज़, पुं० పనిచేయు వాడు; గుమాస్తా; కార్యకర్త: ప్రతినిధి
कारपरदाज़ी, स्त्री० నైపుణ్యము; కర్తవ్యనిర్వహణ
कारबंद, पुं० చెప్పినపనిచేయువాడు అమలుపరచువాడు
कारबार, पुं० వృత్తి: పనిపాటలు

कारबारी, पु० గుమాస్తా; వ్యాపారస్తుడు; वि० పనిపాటలు చేయువాడు

कारखाई, स्त्री० కార్యము; ఉపాయము; రహస్యప్రయత్నము; కార్యతత్పరత; చర్య

कारवाँ, पु० ఒకదేశమునుండి మరియొక దేశమునకుపోవు యాత్రికుల, వ్యాపారులగుంపు A. Carvan

कारसाज़, वि० కార్యసాధకుడు

कारसाजी, स्त्री० కార్యసాధకశక్తి; నైపుణ్యము; యుక్తి

कारस्तानी, स्त्री० కుట్ర; కపటోపాయము

कारा, स्त्री० కైదు; క్లేశము; దూతిక; బంధనము पु० పాము; वि० నల్లని

कारामद, वि० ఉపయోగకరమైన; उपयोगी

कारावासी, पु० కైదీ; బంధితుడు;

कारिंदा, पु० గుమాస్తా; కార్యకర్త; మేనేజరు; ఏజెంట్

क़ारिक़, पु० జప్తుచేయువాడు; వేలము వేయువాడు

कारिख, स्त्री० సిరా; కాటుక; నలుపు; దోషము; కళంకము

कारी, वि० स्त्री० నల్లని; చేయునది; वि० पु० లోతైన; అమోఘమైన; ప్రాణాంతకమైన; पु० చేయువాడు; కళాకారుడు; శిల్పి

कारीगर, पु० శిల్పి; మంచిచేతిపనివాడు; वि० మంచినైపుణ్యముగల

क़ारीगरी, स्त्री० పనితనము; నైపుణ్యము

कारु, पु० శిల్పి; విశ్వకర్మ;

कारुणिक, वि० దయగల; జాలిగల; दयाशील

कारुण्य, पु० దయ; జాలి; करुणा

कारूरा, पु० రోగిమూత్రము; పరీక్షించుటకై రోగిమూత్రముపట్టియుంచు సీసా

कारोंछ, पु० నలుపు; కాటుక; పొగమసి; కళంకము

कारोबार, पु० వృత్తి; పనిపాటలు

कार्कश्य, पु० కురకుదనము; కాఠిన్యము; నిర్దయత

कार्त्तिक, पु० కార్తికమాసము

कार्त्तिकी, स्त्री० కార్తీకపూర్ణిమ

कार्दम, वि० బురదతోనిండిన

कार्निस, स्त्री० గోడలు మొ॥ వాని చివరనుండు శృంగారమైన అంచు Cornice

कार्पण्य, पु० లోభితనము; దారిద్ర్యము; జాలి; దుస్థితి

कार्मारक, पु० కమ్మరిపని

कार्य, पु० పని; హేతువు; అవసరము; కర్తవ్యము; వృత్తి; ధార్మికకృత్యము; పరిణామము; వివాదము; వ్యాజ్యము

कार्यकर्ता, पु० కార్యమునెరపువాడు; ఉద్యోగి

कार्यकाल, पु० పదవీకాలము; పనిచేయుకాలము; సమావేశకాలము

कार्यकुशल, वि० పనిలోనేర్పుగల: చాకచక్యముగల

कार्यकौशल, पुं० పనితనము: నేర్పు

कार्यतः, क्रि० वि० క్రియాత్మకముగా; ఫలితముగా

कार्यदक्ष, वि० పనిలోనేర్పుగల

कार्यनिष्ठ, वि० పనిలోలీనమైయున్న

कार्यवाह, कार्यवाहक पुं० కార్యభారమువహించినవాడు; కార్యదర్శి; పనినిర్వహించువాడు

कार्यवाही, स्त्री० కార్యవివరణము; ఏదైనాపనిచేయుపద్ధతి पुं० కార్యభారమునువహించువాడు

कार्यसूची, स्त्री० పనివివరములు

कार्याधीश, पुं० యజమాని; ప్రభువు

कार्याध्यक्ष, पुं० అధికారి; కార్యపర్యవేక్షకుడు

कार्यान्वित, वि० పనికిసంబంధించిన; కార్యరూపముదాల్చిన

कार्यार्थी, वि० కార్యసాఫల్యము కోరువాడు

कारवाई, स्त्री० కార్యము; ఉపాయము; రహస్యప్రయత్నము; కార్యతత్పరత; చర్య

काल, पुं० సమయము; వ్యవధి; యముడు; ప్రారబ్ధము; అదను; కరువు; ఋతువు; శని; శివుడు; నలుపు; ముదురు నీలిరంగు; కంటినల్లగ్రుడ్డు; ఇనుము; మృత్యువు क्रि० वि० నిన్న; రేపు; वि० నల్లని; హానికరమైన; ముదురునీలిరంగుగల;

कालकंठ, पुं० శివుడు: నెమలి: ఊర పిచ్చుక; కాటుకపిట్ట; वि० నల్లని కంఠముగల వాడు; నల్లనికంఠము గలది

कालकूट, पुं० హాలాహలమనెడి అత్యంత భయంకరమైన విషము

कालकोठरी, स्त्री० జైలులోనిచీకటి కొట్టు

कालखंड, पुं० నియమితకాలము: Period

कालचक्र, पुं० చక్రమువలెతిరిగెడు కాలము; కాలమార్పు; ఒకఅస్త్రము

कालज्ञ, पुं० జ్యోతిష్కుడు; కోడిపుంజు वि० సమయమెరిగినవాడు; కాలమార్పు తెలిసిన

कालनिशा, स्त्री० గాఢాంధకారపురాత్రి దీపావళినాటిరాత్రి

कालपाश, पुं० యముని పాశము: ఉరిత్రాడు;

कालपुरुष, पुं० కాలపురుషునిరూపము; నల్లనివాడు; యముడు

कालबंजर, पुं० బీడుపెట్టిన భూమి

कालबूत, पुं० ఆర్చిలు మొ॥ నిర్మించుటకు తయారుచేసిన చట్రపుపని; మాదిగవాని దిమ్మ: టోపీలు మొ॥ కుట్టుటకుపయోగించుచట్రము

क़ालभैरव, पुं० శివునిగణవిశేషము: శివుడు

काल-रात्रि, स्त्री० ప్రళయకాలమందలి గొప్పరాత్రి; దీపావళి నాటిరాత్రి; కటిక చీకటిరాత్రి

कालवाचक, कालवाची, } वि० సమయము సూచించునట్టి

कालविपाक॰ पुं० కార్యసమాప్తికి నిర్ణయింపబడినగడువు;

काल-सर्प, पुं० నల్లత్రాచు;

क़ाला, वि० నల్లని; కళంకముగల; బ్రహ్మాండమైన; కలుషితమైన; पुं० నల్లత్రాచు; నల్లనివాడు

काला-कलूटा॰ वि० కారునలుపుగల; Jet black

कालाचोर, पुं० గజదొంగ; నీచుడు

कालाजीरा, पुं० నల్లజీలకర్ర

कालातीत॰ वि० కాలముగడచిపోయిన

काला नाग, पुं० నల్లత్రాచు; పరమ దుర్మార్గుడు

कालापन॰ पुं० నలుపు; చీకటి;

कालापानी, पुं० ద్వీపాంతరవాసశిక్ష; అండమానుదీవులు; యావజ్జీవకారాగారశిక్ష; సారాయి

कालिंदी॰ स्त्री० యమునానది

कालि, क्रि० वि० రేపు; నిన్న కల

कालिक, वि० కాలసంబంధమైనది

कालिका॰ स्त्री० కాళికాదేవి; సారాయి; మేఘపంక్తి; సిరా; నలుపు; పొగమసి; కళంకము [పొగమసి

कालिख स्त्री० సిరా; కళంకము;

क़ालिब॰ पुं० శరీరము; పోతఅచ్చు. రూపము; మాదిగవాని దిమ్మ; టోపీ లుకుట్టుటకుపయోగించుచట్రము

कालिमा, स्त्री० నల్లదనము; సిరా పొగమసి; కళంకము; చీకటి

काली॰ स्त्री० పార్వతి, కాళి; చీకటిరాత్రి; రాత్రి; पुं० కాళీయుడనుసర్పము

काली जबान॰ स्त्री० అశుభవాక్కు;

कालीदह॰ पुं० కాళిందిమడుగు (ఇది బృందావనమునగలదు)

कालीन॰ वि० కాలసంబంధమైన

क़ालीन॰ पुं० రత్నకంబళి; తివాసీ; జంపఖానా

कालीमिर्च॰ మిరియములు; गोलमिर्च

कालौंछ, स्त्री० పొగచూరుట; నల్లదనము

कल्ह, काल्हि, } क्रि० वि० రేపు; నిన్న; कल

कावा॰ पुं० గుఱ్ఱములు గుండ్రగా తిరుగుట, పరిభ్రమణము;

काश, अव्य॰ భగవంతుడానప్పగాత पुं० ఒకముని; రెల్లు; రెల్లుపూత; దగ్గు; కాంతి పడిశము.

क़ाश॰ स्त्री० తొన; ఫలములోనికొంత భాగము

काशीफल॰ पुं० గుమ్మడికాయ; कुम्हड़ा

काश्त, स्त्री० దున్నుట. వ్యవసాయము; సేద్యపుహక్కు; సాగుభూమి; కౌలుదారీ

काश्तकार, पुं० వ్యవసాయదారుడు; కౌలుదారు

काश्तकारी, स्त्री० వ్యవసాయము; కౌలుదారీ

काश्तनी॰ वि० సాగుచేయదగిన; దున్నదగిన

काश्ता, वि० సాగుచేయబడిన; దున్నబడిన

काश्मीर, पुं० కుంకుమపువ్వు; కాశ్మీర్

काश्मीरा॰ पुं० ఒకవిధమైన కాశ్మీర్ ఉన్నిగుడ్డ

काश्मीरी॰ वि० కాశ్మీర్ సంబంధమైన; पुं० కాశ్మీర్నివాసి; రబ్బరుచెట్టు; स्त्री० కాశ్మీరుభాష

काषाय॰ पुं० కాషాయవస్త్రము: वि० కావిరంగుగల; కావిరంగుఅద్దబడిన

काष्ठ॰ पुं० వంటచెరకు; కట్టె; కొయ్య

कास॰ पुं० దగ్గు; రొమ్ము;

कासा॰ पुं० గిన్నె; లోటా; ఆహారము; ఫకీరుల భిక్షపాత్ర

कासार॰ సరస్సు; तालाब

क़ासिद॰ पुं० దూత; వార్తాహరుడు; वि० సంకల్పించువాడు; కోరిక గలవాడు

कासिर॰ वि० అపరాధి; దోషి; లోటుగల

कासी॰ वि० దగ్గుతో బాధపడుచున్నవాడు

काह॰ स्त्री० ఎండుగడ్డి; గడ్డిపరక; सर्व० ఏమిటి; ఏది

काह क़ाह॰ पुं० పెద్దనవ్వు; అట్టహాసము

काहल, वि० ముదికిగానున్న; ఎండిన; వాడిన; హానికరమైన; पुं० వాద్యవిశేషము; కాకి, కోడిపుంజు

काहि॰ सर्व० ఎవనిని; దేనిని; ఎవనికి; దేనికి; ఎవనితో; దేనితో

काहिल॰ वि० సోమరి; सुस्त

काहिली॰ स्त्री० సోమరితనము; सुस्ती

काही, वि० పచ్చికరంగుగల; గడ్డితో తయారుచేయబడిన पुं० పచ్చికరంగు; ముదురుపచ్చరంగు

काहु॰ सर्व० ఏదయినా; ఎవనినయినా

काहू॰ सर्व० ఏదయినా; ఎవనినయినా; पुं० మందుకుపనికి వచ్చుఒక మొక్క

किंकर, पुं० సేవకుడు; బంటు; ఒకరాక్షసజాతి

किंकर्तव्य-विमूढ़॰ वि० కలవరపడిన వాడు; ఏమిచేయుటకును తోచనివాడు

किंकिणी, स्त्री० గజ్జె; చిరుగంట; ఒడ్డాణము

किंकिनी, स्त्री० ఒడ్డాణము; करधनी

किंगरी, किंगिरी, } स्त्री० చిన్నసారంగి లేక పిడేలు

किंचित्॰ वि० కొంచెము; थोड़ा

किंज, किंजल, किंजल्क, } पुं० పుష్పపరాగము; తామరపువ్వులోని కేసరములు; పుప్పొడి वि० పసుపు పచ్చని

किंतु॰ अव्य० కాని; మీదుమిక్కిలి; అయినను

किंपुरुष, } पुं० అశ్వముఖమును నర
किंपुरुष, } శరీరమునుగల దేవవిశేషము
(కిన్నర): నీచుడు:

किंवदंती, स्त्री० వదంతి: గాలివార్త

किंवा, अव्य० లేనిచో: లేక

कि, सर्व० ఏమిటి: ఏది: अव्य० ఎట్లు;
ఏమనగ; అని: ఎందుకు; లేక;
లేనిచో: ఇంతలో

किकियाना, अ० क्रि० ఏడ్చుట: పిట్టలు
పురుగులు కిచకిచ మని కూయుట:
పెద్దగా అరచుట: కేకలు వేయుట
కీచుమని యరచుట

किचकिच, स्त्री० వ్యర్థప్రలాపము:
పోట్లాట

किचकिचाना, अ० क्रि० కోపముతో
పండ్లు పటపట కొరుకుట

किचकिचाहट } स्त्री० పండ్లు పటపట
किचकिची, } కొరుకుట

किचड़ाना, अ० क्रि० కండ్లు పుసితో
నిండియుండుట

किचपिच, } स्त्री० అల్లిబిల్లిక:
किचरपिचर, } గుంపు; గొలుసువ్రాత;
वि० క్రమములేని; జిలుగుగానున్న:
అస్పష్టమైన

किछु, वि० కొంచెము: కొంత; కొన్ని:
ఏదేని

किटकिट, पुं० పోట్లాట: వ్యర్థప్రలాపము

किटकिटाना, अ० क्रि० కోపముచే పండ్లు
పటపట కొరుకుట; తినునపుడు
పంటికింద రాయిపడుట स० क्रि०
(పండ్లు) నూరుట

किटकिना, पुं० ఉపాయము: తంత్రము;
బంగారు పనివాని అచ్చుదిమ్మె:
గుత్తదారుడు తనగుత్తను మరి
యొకనికి మార్చునపుడు వ్రాసియిచ్చిన
దస్తావేజు [అచ్చుదిమ్మె

किटकिरा, पुं० బంగారు పనివాని

किटली, स्त्री० కాగు; గాబు

किट्ट, } पुं० త్రుప్పు: నూనెమడ్డి:
किट्टक, } మలము; మురికి

कित, क्रि० वि० ఎక్కడ; ఎటు; వైపు;
वि० ఎంత: ఎన్ని: ఎందరు

कितक, क्रि० वि० ఎంత: ఎక్కడ;
ఎంతదూరము

कितना, वि० ఎంత: ఎన్ని; అత్యధికము
क्रि० वि० అత్యధికముగా;
ఎంతవరకు: ఎక్కడివరకు

कितने, वि० ఎన్ని; ఎంతమంది

क़िता, पुं० భూఖండము: ముక్క:
సంఖ్య; పద్ధతి; ఒక ఉర్దూ పద్యము
కత్తిరింపు (గుడ్డ)

किताब, स्त्री० పుస్తకము: రిజిష్టరు;
జమాఖర్చు లెక్క పుస్తకము

किताबत, स्त्री० వ్రాత; నకలుచేయుట:

किताबफ़रोश, पुं० పుస్తకములమ్మువాడు

किताबी, वि० పుస్తక సంబంధమైన:
పుస్తకాకారముగల

किताबीइल्म. पुं॰ पुस्तकज्ञानमु
किताबी कीड़ा. पुं॰ एल्लप्पुडु पुस्तकमु चदुवुवाडु; Book-worm
किताबीचेहरा. पुं॰ कोल मोगमु
किताबुल्लाह. स्त्री॰ भगवद्ग्रंथमु; कुरानु
किताब-इलाही. स्त्री॰ कुरानु
कितेक. } वि॰ एंत; एंदरु; एन्नि; अधिकमु
कितेब. पुं॰ मतग्रंथमु; पुस्तकमु; दमाखर्चुल पुस्तकमु
कित्ति, स्त्री॰ कीर्ति; प्रसिद्धि
किधर. क्रि॰ वि॰ एटु; एवैपु
किधौं. अव्य॰ लेक; ओक वेळ; लेनिचो; एदोयोक
किनका. पुं॰ सूक; कणमु; किसका योक्क बहुवचनमु
किनहा. वि॰ पुरुगुलु पडिन (पंडु)
किनार, पुं॰ ओड्डु; अंचु; कोन; पार्श्वमु
किनारदार. वि॰ कोन लेक अंचु कलिगिन
किनारा. पुं॰ तीरमु; अंचु; मार्जिनु; मूल; प्रक्क; कोन; हद्दु
किनाराकश. वि॰ कलुगजेसिकोननिवाडु; तटस्थुडु
किनाराकशी. स्त्री॰ जोक्यमु कलिगिंचुकोनकपोवुट; ताटस्थ्यमु
किनारी, स्त्री॰ अंचु; मूल; जरीअंचु
किनारीबाफ़. पुं॰ जरीअंचु तयारु चेयुवाडु
किनारे. क्रि॰ वि॰ ओरगा; तोलगि; चाटुगा; गट्टुन; ओड्डुन; दूरमुगा
किन्नरी. स्त्री॰ चिन्न सारंगि लेक पिडेलुवंटि वाद्यमु; किन्नरुनि भार्य
किन्नरेश, पुं॰ कुबेरुडु; कुबेर
किफ़ायत. स्त्री॰ पोदुपु; कमख़र्च
किफ़ायत का, वि॰ चौकगानुन्न
किफायतशिआर. वि॰ पोदुपु चेयुनट्टि
किफ़ायत शिआरी, स्त्री॰ पोदुपु चेयुट
किफ़ायती, वि॰ मितव्ययमैन; पोदुपुगल; चौकगानुन्न
क़िबला. पुं॰ तंड्रि; मक्का पट्टणमु; पूज्युडु; पेद्दलनु संबोधिंचुनपुडुपयोगिंचु शब्दमु; नमाजुचेयुनपुडु मुसल्मानुलु मुखमु त्रिप्पुपश्चिमदिश
क़िबला आलम. पुं॰ पेद्दलनु; चक्रवर्तुलनु संबोधिंचु शब्दमु
क़िबला-ए-आलम. पुं॰ चक्रवर्ति; बादशाह
क़िबिलागाह. पुं॰ तंड्रि; पेद्दलनु. तंड्रिनि संबोधिंचुनपुडु उपयोगिंचेडिमाट वि॰ पूज्युलैन

क़िबलानुमा॰ पुं० పశ్చిమ దిక్కును సూచించు ఒక యంత్రము. దీనిని అరేబియా నావికులుపయోగించెదరు

किमख़ाब, पुं० జరీబుటా వస్త్రము; A brocade

किमरिख़, स्त्री० సన్నని మేలిమిగుడ్డ; మడుగు వస్త్రము

क़िमाम, पुं० చిక్కని షర్బత్తు

किमार॰ पुं० జూదము; జ్వుఆ

क़िमारख़ाना, पुं० జూదగృహము

क़िमारबाज़, पुं० జూదగాడు; జ్వుఆరీ

क़िमारबाज़ी, स्त्री० జూదమాడుట

किमि॰ क्रि० वि० ఎట్లు; ఏ విధముగా

किम्मत, स्त्री० చాతుర్యము; పరాక్రమము; యుక్తి; వెల

क़ियारी, स्त्री० వరిమడి; పూలమడి; ఉప్పుమడి

किरका, पुं० తునుక; రాతిముక్క; మట్టినలుసు

किरकिटी, स्त्री० కంటినలుసు; అవమానము

किरकिरा, वि० గులకరాళ్లుగల; ఇసుకగానున్న पुं० కమ్మరివానిపనిముట్టు

किरकिराना, अ० क्रि० కంటిలోనలుసు పడి బాధకల్గుట

किरकिराहट, स्त्री० కంటినలుసువలన కలుగునొప్పి; పెళపెళధ్వని; పంటి క్రింద ఏదైనాపడుట

किरकिरी, स्त्री० కంటినలుసు; అవమానము

किरकिल॰ पुं० ఊసరవెల్లి

किरच, स्त्री० మొనగలచిన్న గాజుముక్క; తుపాకిమొనలో అమర్చియుండు బాకు

किरण, स्त्री० సూర్యకిరణము; కాంతికిరణము

किरणमाली, पुं० సూర్యుడు; సూర్య్

किरमिच, पुं० ముతకజనపనారపట్టా; కిత్తనారగుడ్డ Canvas

क़िरमिज़, पुं० బూడిదరంగుతోకలసిన ఎరుపురంగు; ఈరంగుగలగుఱ్ఱము

क़िरमिज़ी, वि० బూడిదరంగుతోకలసిన ఎరుపురంగుగల

किरराना, अ० क्रि० కోపముతోపళ్ళుపటపటకొరకుట; కిర్రుకిర్రుమనిశబ్దము వచ్చుట

किरांची, स्त्री० గూడ్పు బండి పెట్టె; బరువుబండి

किरात, पुं० శివుడు; గుఱ్ఱపువాడు; బోయవాడు; ప్రాచీనఅడవిజాతి

किरातिनी, स्त्री० కిరాతస్త్రీ; బోయస్త్రీ

किराती, स्त्री० కిరాతస్త్రీ; కిరాతస్త్రీ వేషములోనున్న పార్వతి; చామరము నువీచుస్త్రీ; తార్పుడుకత్తె; స్వర్గలోకపుగంగ

किराना, पुं० ఉప్పుపప్పు మొ॥ చిల్లరసామాన్లు स० क्रि० చెరుగుట; తూర్పారబోయుట

